Photo by S. N. Somani



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒప్పుల కుప్ప

పంపినవారు :
కె. హేమాద్రి - గొల్లప్రోలు

# చందమామ

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు



ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



# కెమేరాలు



## 'బ్రౌనీ' రిఫ్లెక్స్ కెమేరా

ఈ కెమేరాలో చాల పెద్ద వ్యూఫైండర్ ఉంది. దానిలో దృశ్యమందు లక్ష్యముంచి మీట నొక్కండి! ఇంటిలో చిత్రములు తీయుటకు ఒక 'కోడక్' ఫ్లాష్‌హోల్డర్ జత చేయాలి.

కేసుతో సహా ... ... రు. 45/-
ఫ్లాష్‌హోల్డర్ ... ... రు. 29/-



## సిక్స్-20 'బ్రౌనీ' కెమేరాలు

ఈ జనప్రియమైన కెమేరాలతో చక్కని, స్పష్టమైన చిత్రములు తీయవచ్చును. మోడలు 'డి'లో క్లోజ్-అప్ లెన్స్ కలదు. మోడలు 'ఇ'లో క్లోజ్-అప్ లెన్స్ మరియు రంగు ఫిల్టరు కలవు. ఇత్తడి వ్యూఫైండర్ ఫ్రేములు మరియు ఫిట్టింగులతోనున్న మోడలు 'ఎఫ్' చూడ ముచ్చటగా ఉంటుంది.

మోడలు 'సి' ... ... రు. 24/-
మోడలు 'డి'* ... ... రు. 29/-
మోడలు 'ఇ'* ... ... రు. 34/-
మోడలు 'ఎఫ్'* ... ... రు. 36/8
* ఫ్లాష్‌హోల్డర్ ... ... రు. 29/-



## బ్రౌనీ 'క్రెస్ట' కెమేరా

ఈ చక్కని స్నేప్‌షాట్ కెమేరాతో మంచి స్నేపులు తీయవచ్చును. దీనిలో షట్టర్ లేక లెన్స్ ఎపర్చర్ సరిచేయుటలు లేవు. మరియు ఫోకసింగ్ చేయనవసరము లేదు. 'కోడక్' ఫ్లాష్‌హోల్డర్ జత చేసి యింటిలోను చీకటి పడిన తరువాత చిత్రములు తీయవచ్చును. ఇవికాక క్లౌడ్ ఫిల్టర్ మరియు క్లోజ్-అప్ లెన్స్ కెమేరాలోనే కలవు. ఈ కెమేరాతో 120 'కోడక్' ఫిల్ము మీద $2\frac{1}{4} \times 2\frac{1}{4}$ అం॥ సైజులో 12 చిత్రములు వచ్చును. ... ... .. రు 29/8

ఫ్లాష్‌హోల్డర్ ... ... రు. 29/-

ధరలలో అమ్మకపు పన్ను చేర్చబడలేదు

కోడక్ లిమిటెడ్ (ఇంగ్లండులో స్థాపితము.
కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము) బొంబాయి-కలకత్తా-ఢిల్లీ-మద్రాసు

'కోడక్' ఫిల్మునే వాడండి !

## మీ బిడ్డ...

1, 3 సంవత్సరముల మధ్య, శాఖాహారులైన మగ బిడ్డలలో, లివర్ వ్యాధులు సామాన్యమని, మా లెక్కలవల్ల తేలుచున్నది.

తరుచుగ అజీర్ణ వ్యాధులు, కడుపు ఉబ్బరము, చికాకు పడుట, కోపము, ఆకలి మందగించుట మొదలైన గుణములు లివర్ వ్యాధిని సూచించు లక్షణములు.

సకాలంలో జమ్మివారిని సలహా చేయండి.




జమ్మి స్

# లివర్ క్యూర్

జమ్మి వెంకటరమణయ్య & సన్స్
జమ్మి బిల్డింగ్స్, మైలాపూర్, మద్రాసు-4.
బ్రాంచీలు: విజయవాడ, తాడంకివారి వీధి, గవర్నరుపేట. విజయనగరము సిటీ, పిడుగుంటవారి వీధి.

NATARAJA • VICTORIA • NATARAJA • VICTORIA • NATARAJA

# పి. నటేశ మొదలియార్

లెస్సీసు { జలగం, సుబ్రహ్మణ్యం నాయుడు & సన్స్
& పి. కృష్ణమూర్తి నాయుడు

PHONE:
3245
2224




Gram:
"JALAGAM"

నెం. 1, నెం. 3, నెం. 7 హల్లర్‌లకు
ఇండియాలో తయారుచేయబడిన
ఉత్తమ హల్లర్ కవరు.

17, ERRABALU CHETTY ST., MADRAS-1

## చందాదారులకు మనవి



★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లైయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లైయింట్లు గమనించబడవు.

మేనేజరు


సమతా పిక్చర్స్ వారు సమర్పించు
ప్రథమ కానుక
త్వరలో
విడుదల
వీనస్ పిక్చర్స్ వారి
అమరజీవి
కథ శ్రీధర్ సంగీతం చలపతిరావు మాటలు పాటలు శ్రీశ్రీ
ఫొటోగ్రఫీ కమాల్‌ఘోష్ కళ తోట . . . . . . . .
Ketha
నిర్మాత: P.V.V. సత్యనారాయణమూర్తి, డైరెక్షన్: T. ప్రకాశరావు

# కొత్త 'గెవాబాక్స్'

కొద్ది సొమ్ముకు
ఎక్కువ ప్రతిఫలము







## రు. 29/-

కొత్త 'గెవాబాక్స్' అనేది అత్యంత ఆకర్షణీయమైన ఒక చిన్ని కెమెరా. లోహపు బాడీకి గల పంపు తిరిగిన మూలలు... చక్కగా గ్రెయిన్ చేయబడిన రెక్సయిన్ లైనింగు....తళతళ మెరిసేట్టు పాలిష్ కాబడిన ఫిట్టింగులు....అందముగ తయారుచేయబడిన వ్యూ ఫైండరు—ఇవన్నీ కొత్త 'గెవాబాక్స్'కు విలువైన రూపము నిస్తున్నవి. అయినప్పటికీ దీని వెల రు. 29/– లు మాత్రమే నిర్ణయింపబడినది.

ప్రత్యేక ఆకర్షణలు :—

- మూడు స్పీడ్లు అనగా : బి, 1/50, 1/100 పైన షటర్ వర్క్సు. షటరుపైన ఒక కేబిల్ రిలీజ్ సాకెట్టు, ఒక స్టాండర్డు ఫ్లాష్ కొంటాక్టు ఈయబడును.
- ఈ కెమెరాతో ఏ రకపు ఫ్లాష్ గనను ఉపయోగించవచ్చును.
- పక్కనుండు చిన్న మీటను తిప్పుటతో, కెమెరాను అతిసులువుగా తెరవవచ్చు, మూయవచ్చు.
- వైండింగు త్వరితముగ చేయుటకు అనువుగా ఫిలిమ్ వైండింగు నాబ్‌కు మిద్దు అంచులు కలవు.
- ఫిలిం నంబరింగు విన్డోకు రక్షణగా స్లైడింగ్ కవర్ అమర్చబడివున్నది.

మీ గెవాబాక్సులో గెవాపాన్ 33°
లేక 36° ఉపయోగించండి.

**'GEVABOX'**

**ALLIED PHOTOGRAPHICS PRIVATE LIMITED**

**ఎల్లయిడ్ ఫోటోగ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ్,**

కస్తూరి బిల్డింగ్స్, జంషెడ్జీ టాటా రోడ్డు, బొంబాయి - 1

ప్రతి గురువారమూ రాత్రి 8-00 గంటలకు (41 మీటర్ బ్యాండు)
సిలోన్ రేడియోమీద ఎ. పి. ఎల్. వారి 'ఫోటో-మేలా' వినండి.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

అధికారులు అవినీతి పరులైనప్పుడు సంఘంలో ఉండే దుష్ట శక్తులు యథేచ్ఛగా విజృంభిస్తాయి. అటువంటి సంఘంలో ఎవరైనా పుణ్యాత్ములు మంచి పరిణామం సాధించినప్పటికీ అవినీతిపరులైన అధికారులు ఆ పరిణామాన్ని చూసి సహించలేరు. వారు తమ స్వార్థంకోసం పుణ్యాత్ములను నాశనం చేయజూస్తారు.

"కొండెగాడు" (జాతక కథ)లో ఇదే మనకు కనిపిస్తుంది. మాఘుడు తన గ్రామస్థు లందరినీ దుర్మార్గంనుంచి సన్మార్గానికి తిప్పి, వారిని తనవెంటవేసుకుని గ్రామసేవ ఆరంభిస్తాడు. కాని ఇందువల్ల గ్రామాధికారికి లంచాలు ముట్టకుండాపోతాయి. ఆయన రాజువద్దకు వెళ్ళి మాఘుడి పైనా, అతని అనుచరుల పైనా లేని నేరాలు మోపుతాడు. కాని నిజం దాగదు. మాఘుడి సత్ప్రవర్తనే చివరకు జయిస్తుంది. గ్రామాధికారి చేసిన కుట్ర బయట పడుతుంది. అతని పదవి కాస్తా పోయి, గ్రామపెత్తనం గ్రామస్థుల పరమవుతుంది. ప్రజలు నీతిగా తమను తాము పరిపాలించుకోగలిగితే అధికారుల అవసరం ఉండదని ఈ కథ చెబుతోంది.

సంచిక 1

జూలై 1956

సంపుటి 19

CHITRA

# అట్టివారిది బొమ్మ

కామ్యకవనంలో ఉంటున్న పాండవులు ఒకనాడు వేటకు బయలుదేరి పోతూ, ద్రౌపదిని తృణబిందు మహాముని ఆశ్రమంలో ఉంచి, తమ కులపతి అయిన ధౌమ్యుణ్ణి ఆమెకు తోడుంచి అడివిలోకి వెళ్ళిపోయారు. ఆ సమయంలో సైంధవుడు సాళ్వరాజు కుమార్తెను వివాహమాడటానికి సపరివారంగా బయలుదేరి కామ్యకవనంగుండా పోతూ తృణబిందు మహాముని ఆశ్రమం చెట్లమధ్య నిలబడి ఉన్న ద్రౌపదిని చూశాడు.

వెంటనే సైంధవుడు తన రథం ఆపి కోటికాస్యుడనే తన మిత్రుని పిలిచి, "ఆ స్త్రీ ఎవరో తెలుసుకొని రా. ఈమెను చూసినతరవాత ఆ సాళ్వ రాజు కుమార్తెను పెళ్ళాడాలని నాకు కోరిక లేదు," అన్నాడు. కోటికాస్యుడు వెళ్ళి ద్రౌపదితో మాట్లాడి వచ్చి, "ఆమె పాండవుల భార్య అయిన ద్రౌపది. పాండవులు వేటకు వెళ్లారట," అని చెప్పాడు.

ఇది విని సైంధవుడు రథం దిగి ద్రౌపది ఉన్న చోటికి వచ్చి కుశల ప్రశ్నలు చేశాడు. ద్రౌపది అతని ప్రశ్నలకన్నిటికీ జవాబు చెప్పింది.

కాని ఆ దుర్మార్గుడు ద్రౌపదితో, "వెర్రివానా, ఈ పాండవులతోబాటు ఎందుకీ అరణ్యవాసం అనుభవిస్తావు? అదుగో నా రథం. దానిలో ఎక్కి పోదాం పద!" అన్నాడు. ద్రౌపది మండిపడి, "దుర్మార్గుడా, అమర్యాదగా మాట్లాడా వంటే నా భర్తలు నిన్ను నిలువునా చంపగలరు, జాగ్రత్త! అధిక ప్రసంగం చెయ్యక వచ్చిన దారి పట్టు!" అని సైంధవుణ్ణి దూషించింది.

సైంధవుడామె మాటలు లక్ష్యపెట్టక, "దిక్కులేక అడవులు పట్టిపోయిన నీ భర్తలను చూస్తే నాకు భయమనుకున్నావా? నీవు మంచిగా నావెంట రాక పోయావంటే, నిన్ను బలాత్కారంగా తీసుకుపోతాను. నీ భర్తలెలా అడ్డు తారో చూస్తాను!" అంటూ ఆమెను బలవంతాన ఎత్తుకుని బయలుదేరాడు.

అసహాయురాలైన ద్రౌపది, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టసాగింది. ఆ కేకలు విని ధౌమ్యుడు ఆశ్రమంలోనుంచి బయటికి వచ్చి, సైంధవుడితో, "దుర్మార్గుడా, నీ ప్రయత్నం మాను! చెడిపోతావు!" అని చెప్పాడు.

కాని సైంధవుడు ధౌమ్యుణ్ణి లక్ష్యపెట్టక, ద్రౌపదిని తన రథంలో కూర్చోబెట్టి, తానుకూడా రథమెక్కి బయలుదేరాడు. ధౌమ్యుడు కేకలు పెడుతూ రథం వెనకగా పరిగెత్తసాగాడు.



# కొండెగాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు మగధదేశంలోని ఒక గ్రామంలో మాఘుడనే ఒక క్షత్రియ కుమారుడుగా జన్మించాడు. ఆ గ్రామంలో ముప్ఫై గడప ఉండేది. గ్రామవ్యవహారాలు చర్చించటానికి ముప్ఫై యిళ్ల మగవాళ్ళూ రచ్చపట్టులో సమావేశ మవుతూండేవారు. ఈ గ్రామస్తులు నీతి నియమాలు లేని వాళ్ళు. దొంగతనాలూ, హత్యలూ మొదలైనవి చేసి, లంచాలతో గ్రామాధికార్ల నోరు మూస్తూండే వాళ్ళు.

ఈ రచ్చపట్టుకు ఆలనా పాలనా లేదు. చెత్తా చెదారమూ ఉండేది. ఇది చూసి మాఘుడు తనకోసమని కొద్దిమేర శుభ్రం చేసుకున్నాడు. కాని ఆ ప్రదేశాన్ని మిగిలిన వారిలో ఎవరో కాజేసి స్వంతం చేసుకున్నారు. మాఘుడు మరొక జాగా శుభ్రం చేసుకున్నాడు. దాన్నికూడా ఇంకెవరో ఆక్రమించుకున్నారు. ఈ విధంగా మాఘుడు ఓపికతో రచ్చపట్టంతా శుభ్రంచేశాడు. ఆ తరవాత అక్కడ నీడగా ఉండేటందుకు ఒక పందిరి వేశాడు. ఇందువల్ల గ్రామస్తులందరికీ చాలా సుఖం చేకూరింది.

మాఘుడి ప్రవర్తన ముప్ఫై ఇళ్ల మగవారినీ ఆకర్షించింది. వారంతా అతని నాయకత్వం ఆమోదించి గ్రామసేవలో నిమగ్నులయారు. అందరూ కలిసి సమావేశాలకోసరం ఒక పెద్ద మందిరం నిర్మించి, తాగేటందుకు నీరుకూడా ఏర్పాటు చేశారు. అదిమొదలు వారు మాఘుడివద్ద పంచశీలాలు నేర్చుకుని సద్వర్తనులై మెలగసాగారు. వారు రోజూ రహదారులు చదును చేసేవారు. వచ్చేపోయే రథాలకు అడ్డంగా ఉండే చెట్లకొమ్మలను నరికేవారు. గుంటలు పూడ్చేవారు, చెరువులు తవ్వేవారు, తేమ ప్రదేశాల మధ్యగా నడిచేటందుకు ఎత్తు



యిన కట్టలు వేసేవారు. వారికి మాఘుడు మార్గదర్శీ, నాయకుడూ అయాడు.

ఆ ఊరికి ఒక గ్రామాధికారి ఉన్నాడు. ఊళ్లో ఉండే యువకులు తాగుబోతులుగా, జూదరులుగా, హంతకులుగా, నీతిమాలి ప్రవర్తించుతూ ఉన్న కాలంలో ఈ అధికారి సందు దొరికినప్పుడల్లా లంచాలు లాగీ, లంచా లివ్వనివారికి జరిమానాలు వేసీ, పుష్కలంగా సంపాదించాడు. కాని ఊరి కుర్రవాళ్లకు మాఘుడు నాయకుడై, వారు సన్మార్గం అవలంబించిన నాటినుంచీ గ్రామాధికారి సంపాదన సన్నగిలింది. అందుచేత ఆ అధికారి రాజుగారివద్దకు వెళ్లి, "మహారాజా, మా గ్రామంలో అరాజకం బలిసిపోయింది. మాఘుడనేవాడి ప్రభావంచేత ఊళ్ళో ఉన్న యువకులందరూ అస్తమానమూ కర్రలూ, గండ్ర గొడ్డళ్ళూ, పలుగులూ పట్టుకు తిరుగుతున్నారు. ఏ రహదారి మీద చూసినా వీళ్ళే. వీళ్ళమూలంగా ప్రజలకు చెప్పరాని ఉపద్రవం వచ్చిపడింది! విలినవారికి విన్నవించటం నావిధి! పైన తమచిత్తం!" అని ఫిర్యాదు చేశాడు.

విషయం ఏమిటో తెలుసుకుని, అధికారి చెప్పినది నిజమైతే గ్రామస్థులనందరినీ బంధించి తెమ్మని రాజు గ్రామాధికారి వెంట తగినంతమంది సైనికభటులను పంపాడు. వారు గ్రామంలోకి రాకముందే, మాఘుడూ అతని అనుచరులూ వారికి రహదారిపై కనిపించారు. ప్రతి ఒకరి చేతిలోనూ కర్రో, పలుగో, గొడ్డలో ఉన్నది. మారుమాట లేకుండా సైనికభటులు వారందరినీ పట్టుకుని, పెడరెక్కలు విరిచికట్టి రాజుగారి ఎదట హాజరుపెట్టారు.

రాజు వాళ్లనూ వాళ్ల చేతుల్లో గల ఆయుధాలనూ చూసి, వాటిని వాళ్లు గ్రామసేవకు వినియోగిస్తున్నారని గ్రహించలేక, గ్రామాధికారి చేసిన ఫిర్యాదు రుజువైనట్టే ఎంచాడు.



అందుచేత ఆయన వారిని విచారించకుండానే, "ఏనుగు పాదాలకింద ఈ దుర్మార్గులను తొక్కించి చంపించండి!" అని ఉత్తరు విచ్చాడు.

మాఘుణ్ణీ అతని అనుచరులనూ తొక్కించటానికిగాను పట్టపు ఏనుగును ఆయత్తం చేసి తెచ్చారు. అది వారికి కొంత దూరంలోకి వచ్చి ఆగి, బెదిరిన దానిలాగా వెనక్కు తిరిగి పారిపోయింది. మరొక ఏనుగును తెచ్చారు. అదీ అలాగే పారిపోయింది.

ఈ వార్త రాజుకు అందింది. మూఢుడైన ఆ రాజు, "వాళ్ల శరీరాలమీద తాయెత్తులూ, రక్షరేకులూ ఉండిఉంటాయి. అందుకే ఏనుగులు వాళ్లని సమీపించలేకపోయాయి. వాళ్లను పరీకించి అటువంటివేవైనా ఉంటే విప్పి అవతల పారేసి, మళ్లీ ఏనుగులను పంపండి!" అని భటులను ఆజ్ఞాపించాడు.

కాని ఎవరి వంటిమీదకూడా ఒక్క చిన్న తాయెత్తుకూడా లేదు. ఈ సంగతి విని రాజు "ముద్దాయిలను నావద్దకు పంపండి!" అన్నాడు. మాఘుడు మొదలుగాగల ముప్ఫైమందీ రాజుఎదట హాజరయారు.

"ఏనుగులు మిమ్మల్ని తొక్కటానికి ఎందుకు భయపడ్డాయి? మీరేదో మంత్రాలు




చదువుతూ ఉండి ఉంటారు. నిజమేనా? మీకేమైనా మంత్రాలు వచ్చునా?" అని రాజు వారిని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు మాఘుడు ఈవిధంగా సమాధానం చెప్పాడు :

"మీరన్నది నిజమే, మహారాజా! మా దగ్గిర గొప్ప మంత్రం ఉన్నది. దాన్ని మించిన మంత్రం ప్రపంచంలో మరిలేదు."

"ఏమిటా మంత్రం?" అని రాజు ఆత్రంగా అడిగాడు.

"మాలో ఒక్కరుకూడా జీవహింస చెయ్యరు, ఒకరివ్వని వస్తువు తీసుకోరు, తప్పుడు ప్రవర్తనలకు దిగరు, అబద్ధా

లాడరు ; మేమెవరమూ మత్తు కలిగించే పదార్థాలు తాగము ; మేము జీవులను ప్రేమిస్తాము, భూతదయ ఆచరిస్తాము ; మేము దానాలు చేస్తాము, దారులు బాగు చేస్తాము, చెరువులు తవ్వుతాము, సత్రాలు కడతాము. ఇదే మాదగ్గిర ఉండే మంత్రం; ఇదే మా బలం," అన్నాడు మాఘుడు.

ఇది విని రాజు నివ్వెరపోయి, "ఇదేమిటి ? మీరు దారులు కాస్తారనీ, మీదగ్గిర ఉండే ఆయుధాలతో ప్రజలను భయపెట్టి డబ్బు దోచుకుంటారనీ విన్నానే ? అవేమీ నిజంకాదా ?" అన్నాడు.

"మీరు యితరులు చెప్పినది విని నమ్మారుగాని, నిజానిజాలు విచారించ లేదు," అన్నాడు మాఘుడు.

"మీరు పలుగులతో, గొడ్డళ్ళతో మా భటులకు దొరికారు. అందుచేత విచారించటం అనవసర మనిపించింది," అన్నాడు రాజు, మరింత ఆశ్చర్యపడుతూ.

"అవి మేము వినియోగించే సాధనాలు. రహదార్ల పక్కన ఉండే చెట్లకొమ్మలు దారి కడ్డంగా ఉంటే, గొడ్డళ్ళతో నరుకుతాం. చెరువులు తవ్వటానికీ, దారులు వెయ్యటానికీ, సత్రాలు కట్టటానికీ అవసరమైన పరికరాలు మావెంట ఎప్పుడూ ఉంటాయి," అన్నాడు మాఘుడు.

ఇంత అయాక రాజు వారినిగురించి సరి అయిన విచారణ జరిపి, నిజం తెలుసుకున్నాడు. గ్రామాధికారి చేసిన ఆరోపణ అబద్ధమని రుజువయింది. ఆ అధికారి ఎన్నో ఏళ్ళుగా లంచాలు పట్టి సంపాదించిన సొత్తు నంతటినీ రాజు ఈ యువకుల పరం చేస్తూ, "ఇకనుంచీ మీగ్రామాన్ని మీరే ఏలుకోండి. నేను వేరే అధికారిని నియమించను," అన్నాడు.

వారిని తొక్కించటానికి తెప్పించిన పట్టపు ఏనుగునుకూడా ఆయన గ్రామస్తులకు కానుకగా ఇచ్చి పంపేశాడు.





# ముని ముచ్చు

ఒక ధనవంతుడు పొరుగూరు వెళ్లి తిరిగి వస్తూండగా దారిలో చెట్టుకింద ఒక మునీశ్వరుడు కనిపించాడు. ఆ ముని దొంగ ముని అని ఎరగక, ధనికు డాయనముందు సాష్టాంగపడి, "స్వామీ, తమరు మా యింటికి వచ్చి, కొంతకాలం ఉండి, నన్ను తరింపజేయాలి!" అని వేడుకున్నాడు. ముని సమ్మతించాడు.

ధనికుడు తన ఇంటి ఆవరణలో చక్కని పర్ణకుటీరం ఒకటి వేయించి, పూజకూ, యోగాభ్యాసానికీ, తపశ్చర్యకూ అనువయిన సదుపాయాలన్నీ ఏర్పాటు చేయించి, మునిని ఆ కుటీరంలో ఉండ నిచ్చాడు. మునికి రోజులు సుఖంగా వెళ్లిపోతున్నాయి.

ఇంతలో ఆ ప్రాంతంలో దొంగలభయం జాస్తి అయింది. ధనికుడివద్ద వెయ్యి మొహరీలున్నాయి. వాటిని ధనికుడు పర్ణ కుటీరంలో దాచ నిశ్చయించాడు. ఏమంటే, ఒకవేళ దొంగలు వచ్చినా ఆ ముని ఉంటున్నచోటుకేసి పోరు; అటువంటి ప్రదేశంలో డబ్బు ఉంటుందని వారి కసలు అనుమానమే పోదు.

ధనికుడు వెయ్యి మొహరీలనూ సంచిలో పోసి, ఒకనాటి రాత్రి పర్ణకుటీరానికి వచ్చి, ఒకమూల గుంటతవ్వి, అందులో సంచీ పెట్టి, మళ్లా గుంట పూడ్చి, మునితో, "స్వామీ, క్షమించండి, దొంగల భయం జాస్తిగా ఉండటంచేత ఈ సొమ్ము ఇక్కడ దాచవలిసి వచ్చింది!" అన్నాడు.

"అంతా మాయ! భ్రమ!" అన్నాడు ముని నవ్వుతూ. ధనికుడు మునికి సాష్టాంగ పడి తన ఇంటికి వెళ్లిపోయాడు.

నెలరోజులు గడిచాయి. ఒకనాటి రాత్రి దొంగముని ఆ మొహరీల సంచీని తవ్వి ధనికుడి ఇంటి ఆవరణకు దూరంగా ఒక చోట పాతిపెట్టి తిరిగివచ్చాడు.

కె. సాత్యకిరావు

మర్నాడు ఆ ముని ధనికుడి ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో ధనికుడు ఒక మిత్రుడితో యేదో మాట్లాడుతున్నాడు. ఆయన మునిని చూడగానే లేచి వందనం చేసి, "ఏమి సెలవు, స్వామీ?" అన్నాడు.

"నాయనా, నేను వెళ్ళివస్తాను. లోక సంచారం చేయవలసినవాళ్లం ఎంతకాల మని ఒకేచోట వుంటాం? ఇక వెళ్ళాలి!" అన్నాడు దొంగముని.

మరి కొంతకాలం వుండమని ధనికుడు ప్రార్థించాడు. కాని ముని ఒప్పలేదు. "బయలుదేరమని ఆజ్ఞ అయింది, నాయనా! వెళ్లితీరాలి! అన్నట్టు, ఈ పూచికపుల్ల ఎలా వచ్చిందో నా జోలెలోకి వచ్చింది. నీ సొత్తు నీవే వుంచుకో!" అంటూ ఆ ముని ఒక పూచికపుల్లతీసి భద్రంగా ఒక పక్కగా పెట్టి బయటికి వెళ్ళిపోయాడు.

"ఎవరీ దొంగబైరాగి?" అని మిత్రుడు ధనికుణ్ణి అడిగాడు.

"ఏమోయ్, అలా అంటావేం? ఆ మనిషి పూచికపుల్లకూడా ఇతరులది కోరడు. కనిపించటంలేదా? ఆయన వుండే కుటీరంలో వెయ్యి బంగారు మొహరీల సంచీ ధైర్యంగా దాచిపెట్టాను, తెలుసా?" అన్నాడు ధనికుడు.

"అది అక్కడ వుండదని నా అను మానం. ఎందుకైనా మంచిది, వెంటనే వెళ్లిచూసుకో!" అన్నాడు స్నేహితుడు.

అతని మాట అక్షరాలా నిజమయింది. ధనికుడువెళ్లి పర్ణకుటీరంమూలతవ్విచూస్తే డబ్బులేదు. వెంటనే ఆ ధనికుడూ, అతని స్నేహితుడూ గుర్రాలమీద బయలుదేరి కొద్దిసేపట్లోనే దొంగమునీశ్వరుణ్ణి పట్టు కున్నారు. అతని జోలెలో మొహరీలసంచీ దొరికింది. నాలుగు తన్నినమీదట దొంగ మునీశ్వరుడు దొంగతనం చేసినట్టు ఒప్పు కున్నాడు. తరవాత అతన్ని ధనికుడు న్యాయాధికారికి వప్పగించాడు.






## 13

[నరవాహనుడి సైన్యానికీ, కోయలకూ జరిగిన యుద్ధంలో, నరవాహన సైనికులు కోయ భటులను హతమార్చి, శిగిలదుర్గాన్ని ఆక్రమించుకున్నారు. శివదత్తుడు తన అనుచరులతో సముద్రంమీద బయలుదేరాడు. వారికి దారిలో మందరదేవుడు కనిపించాడు. కొంత సేపటికి దూరాన వెలుగు కనిపించింది. పడవలను అటుకేసి నడపసాగారు. తరవాత—]

కన్ను పొడుచుకున్నా కానరాని ఆ కారు చీకటిలో శివదత్తుడూ, మందరదేవుడూ వున్న పడవలు రెండూ క్రమంగా వెలుగు కనబడుతూన్న వైపుకు కదల సాగినై. అప్పటికి రెండు మూడు రోజులుగా మహా సముద్రంమీద నిద్రాహారాలు లేని వాళ్ళ అనుచరులు ఆరుగురూ, తెడ్ల సహాయంతో పడవలను మందంగా నడప సాగారు.

"శివదత్తా, నన్ను ఆకలి దహించి వేస్తున్నది," అంటూ మందరదేవుడు శివదత్తుడికేసి చూసి, "మన అనుచరులూ అదే స్థితిలో వున్నారు. ఆ వెలుగు కనబడే ప్రాంతం ఏదోవొక ద్వీపమై వుంటుందనేందుకు సందేహంలేదు. పోతే అది మానవ వాస యోగ్యమవునా కాదా అన్నదే సమస్య!" అన్నాడు.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను," అంటూ శివదత్తుడు నవ్వాడు. "ఎక్కడో ఒక చోట ఏదోవిధంగా పొట్ట నింపుకుంటూ కాలక్షేపం చెయ్యటమే మన జీవితాశయం



కాదనుకుంటాను. మీరు పదచ్యుతులైన మరాళద్వీప ప్రభువులు! నేను మహాసేనాని సమరసేనుడి అనుచరుణ్ణి! ఇద్దరమూ క్రూరాతి క్రూరుడైన ఒకేవ్యక్తి కారణంగా, యీ గాఢాంధకారంలో, కానని సముద్ర ప్రాంతాల తిరుగుతున్నాం!"

శివదత్తుడి మాటలకు మందరదేవుడు జవాబివ్వలేదు. అతడి మనసులో ఒక్కసారిగా మరాళద్వీపం, అక్కడి ప్రజలు, తను రాజ్యాన్ని కోల్పోయిన సంఘటనలూ- అన్నీ మెరుపులా కదిలినై.

"శివదత్తా, మీరు చెప్పదలచిన విషయమేదో నేను గ్రహించాను. ఎంత భయంకర



ద్వీపంలో అయినా అడుగిడేందుకు నేను భయపడను. అంతేకాదు, నాబొందెలో ప్రాణంవుండగా నరవాహనుడు నాకు చేసిన ద్రోహన్ని మరచిపోను. తిరిగి నారాజ్యాన్ని జయించుకునేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తాను" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడికి, మందరదేవుడి మాటలు చాలా సంతోషాన్ని కలిగించినై. నరవాహనుడు చేసిన ద్రోహన్ని అతడు మరిచిపోలేడని శివదత్తుడు గ్రహించాడు. అతడు ఏమో చెప్పబోయేటంతలో, పడవలు నడుపుతున్న భటులు ఒక్కసారిగా కేకలుపెట్టారు.

"ఈ ప్రాంతమంతా కొండరాళ్ళమయం! మనం ఏదో ద్వీపాన్ని సమీపించాం. ఈ చీకటిలో ఈ కొండరాళ్ళను తప్పించుకుని పడవలు నడపడం సాధ్యంకాదు!" అన్నారు వాళ్ళు.

శివదత్తుడు పడవలను వున్నచోటనే ఆపవలసిందిగా ఆజ్ఞాపించాడు. జాగ్రత్తగా ముందుకు చూచినప్పుడు అతడికి సముద్రతీరంవెంట గుబురుగాపెరిగిన చెట్లగుంపులు చూచాయగా కనిపించినై. తాము ఒకానొక ద్వీపప్రాంతాన్ని చేరారు, అందులో సందేహం లేదు. కాని పడవలు తీరాన్ని చేరే మార్గంమటుకు లేదు. ఆ ప్రాంతమంతా-





సముద్రజలంలోనుంచి నిక్కి చూస్తున్న కొండశిఖరాల మయం. అలల తాకిడికి పడవలు వాటిలో ఏఒక్కదానికి కొట్టుకున్నా అది ముక్కలు చెక్కలు కాకమానదు!

"మందరదేవా, మన సముద్రయానం ముగిసింది!" అన్నాడు శివదత్తుడు. "ఎదురుగా తీరాన్ని ఒరుసుకుంటూ, గాలికి తలలూపే చెట్లవరుస మీకు కనబడుతున్న దనుకుంటాను. ఈ చీకట్లో, ఈ రాళ్లమధ్య నుంచి పడవలను తీరానికి చేర్చటం సాధ్యమయే పని కాదు!"

"సూర్యోదయంవరకూ యిక్కడే వేచి వుందామని మీరు అభిప్రాయపడు తున్నారా?" అని మందరదేవుడు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

శివదత్తుడు తల పంకించి, "ఆ పద్ధతి మంచిదికాదనుకుంటాను," అన్నాడు."ఒక వేళ యీ ద్వీపం ఏ అనాగరిక మానవులకో నిలయమై వున్నట్టయితే, వాళ్లు మనను పట్టపగటి వెలుగులో యిట్టే పసిగట్టి వేటాడ గలరు. కనుక, మనం చీకటి వుండగానే తీరం చేరి అక్కడి పరిస్థితు లెలావున్నవో తెలుసుకోవటం మంచిది. ఒకవేళ ఎవరైనా మనను ఎదిరించేట్టయితే, చీకట్లో ప్రమాదాన్నుంచి పారిపోవటం తేలిక," అన్నాడు.



శివదత్తుడి అభిప్రాయంతో మందర దేవుడు ఏకీభవించాడు. పడవలు రెండూ అక్కడ నీటిలో మునిగివున్న కొండ శిఖరాలకు కట్టబడినై. ఇక తీరం చేరాలంటే దాదాపు రెండు మూడు ఫర్లాంగులు నిలువు లోతు నీటిలో యీదుకు పోవాలి. తీరాన అలలు ఉవ్వెత్తున లేస్తూన్నందువల్ల ప్రమాదం లేకుండా ఒడ్డుకు చేరటం కష్ట సాధ్యమని అందరూ గ్రహించారు.

కొంచెంసేపు సంప్రతింపుల తరవాత అందరూ నడుములు బిగించి నీటిలోకి ఉరికారు. పెద్దపెద్ద అలలు వారిని రాళ్ళ మీదకు విసరసాగినై. ఎంతో నేర్పుగా వాటిని

తప్పుకుంటూ చివరకు ఎలా అయితేం అందరూ ఒడ్డుచేరారు. తడిసిన గుడ్డలను పక్కన పడవేసి, మూటలుకట్టి తెచ్చుకున్న పొడిగుడ్డలను ధరించారు. అయినా అందరూ చలికి వణికి పోతున్నారు.

"ఈ చలిబాధను తట్టుకోవాలంటే, మంట వేయటం తప్ప మార్గం లేదు. ఎండు పుల్లలు పోగుచేయమంటారా?" అని ఒక సైనికుడు శివదత్తుణ్ణి అడిగాడు.

"సరే కానివ్వండి. ఒకవేళ యీద్వీపం ఏ నరమాంసభక్షకులకో ఆలవాలమైతే మనను ఆ మంటలోనే వాళ్ళు కాల్చుకు తినగలరు" అంటూ శివదత్తుడు నవ్వాడు.

"మన చేతనున్న పదునైన కత్తులూ, విల్లంబులూ..." అంటూ మందరదేవుడు ఏమో చెప్పబోయేంతలో శివదత్తుడు అతడి మాటలకు అడ్డువచ్చి, "మందరదేవా, మీకు ఇలాంటి ద్వీపాల సంగతీ, అందులో నివసించే ఆటవికుల సంగతీ తెలీదు. ఈ ఆటవికులు భయమంటే ఏమిటో తెలియని అమాయకులు. మీరు కత్తితో ఒకణ్ణి నరికేంతలో, ఆ వెనకనుంచి ఒక్కసారిగా ఆరుగురు మీ మీదకు లంఘిస్తారు!" అన్నాడు.

ఇంతలో సైనికులు ఎండుపుల్లలు పోగుచేసి నిప్పు వెలిగించారు. అందరూ ఆ మంట చుట్టూ చేరి చలి కాచుకుంటున్నారు. శివ





దత్తుడు తను ఎలాంటి ద్వీపం చేరాడో, ముందుముందు ఎలాంటి ప్రమాదాలను ఎదుర్కొనవలసి వుంటుందో అని ఆలోచించసాగాడు. మందరదేవుడికి మాత్రం అలాంటి ఆలోచనలేమీ లేవు. సూర్యోదయం అయితే, ఆవెలుగులో యీద్వీపాన్ని గురించి సర్వం అవగాహన చేసుకోవచ్చునని అతడి తలంపు.

ఉన్నట్టుండి హఠాత్తుగా కుక్క అరిచిన సవ్వడి వినబడింది. శివదత్తుడితోపాటు అందరూ ఒక్కసారిగా ఉలిక్కిపడి, ఆ సవ్వడి వచ్చిన వైపుకేసి తలలు తిప్పారు. మందరదేవుడు కూడా కొద్దిసేపు అటుకేసి పరీక్షగాచూచి, తరవాత శివదత్తుడి నుద్దేశించి యిలా అన్నాడు:

"శివదత్తా, మనం భయపడినట్టు ఇది అనాగరిక జాతులు నివసించే భయంకర ద్వీపం కాదనుకుంటాను. కుక్కను మచ్చికచేసి వుపయోగించుకోవటం ఒక్క నాగరిక మానవులకే తెలుసు!"

"మందరదేవా, మీరు చాలా పొరబడ్డారు," అంటూ శివదత్తుడు నవ్వాడు. "నా కళ్లతో నేను చిరుతపులులను మచ్చిక చేసి వేటకు వుపయోగించే ఆటవికులను చూచాను. ఆ సంగతి చెప్పాననుకుంటాను. పోతే, యిప్పుడు మనం విన్న కుక్క అరుపు



ఏ అడవికుక్కదయినా కావచ్చును! సూర్యోదయం అవగానే..."

శివదత్తుడు మాట ముగించకముందే, చెట్లకొమ్మలను రివ్వుమని రాచుకుంటూ ఒక పెద్ద రాయి శరవేగంగా వచ్చి మంట ముందు చలికాచుకుంటున్న ఒక సైనికుడి వీపును తాకింది. సైనికుడు ఆ దెబ్బకు ఒక చావుకేక పెట్టి ముందుకు పడిపోయాడు. వెంటనే మందరదేవుడు బాణం ఎక్కుపెట్టి ఆ రాయి వచ్చిన వైపుకు వదిలాడు.



మరుక్షణం శివదత్తుడుకూడా భయంతో వణికిపోయేలాంటి వికృతమానవ కంఠం బాధతో అరిచిన ధ్వని వినబడింది. అందరూ ఒకరి మొహాలు ఒకరు చూచుకుని నివ్వెరపోయారు. ఈ ద్వీపం వట్టి నిర్జనప్రదేశం కాదు. ఏవో భయంకరమైన క్రూర మానవ జాతులు కొన్ని యిక్కడ నివసిస్తున్నవి. అందుకు సాక్ష్యం, తొలిసారిగా వినబడిన ఆ వికృత మానవకంఠం!

మందరదేవుడు కత్తి దూసి ముందుకు నడుస్తూ, సైనికులను తనను అనుసరించమన్నాడు. కాని అంతలో శివదత్తుడు అతణ్ణి వారిస్తూ, "మందరదేవా, మీరు చేయబోతున్న పని చాలా ప్రమాదకరమైనది. ఈ చీకటిలో మనం శత్రువులను వెంటాడలేము. ఈ ద్వీపానికి మనం కొత్తవాళ్ళం. ఏ చెట్టుచాటున, ఏ పొదమాటున ఎలాంటి ప్రమాదం పొంచివుంటుందో మనకు తెలియదు," అన్నాడు.

"ఆ రాయి విసిరిన వాడెవడైనా, అతణ్ణి నా బాణంతో గాయపరిచాను. అంబు తాకీ తాకటంతోనే వాడు వికృతంగా అరిచాడు. బహుశా వాడు యింకా బ్రతికివుంటే, వాణ్ణింంచి మనం యీద్వీపంలోని మంచి చెడ్డలు తెలుసుకోవచ్చు," అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు, మందరదేవుడి అభిప్రాయంతో ఏకీభవించలేదు. "ఇప్పటి



స్థితిలో మీ బాణందెబ్బకు గురైనవాడు మరణించాడో లేక గాయపడి పారిపోయాడో మనకు తెలియదు. వాడు ఒంటరిగాడా లేక మరికొందరితో కలిసివున్నాడా అన్నదికూడా మనం వూహించలేం. కనుక, సూర్యోదయం వరకూ తగు జాగ్రత్తలో; వున్న చోటు నుంచి కదలకపోవటం అన్నివిధాలా మంచిది," అన్నాడు శివదత్తుడు.

శివదత్తుడి మాటలకు అంగీకార సూచకంగా అందరూ తలలు వూపారు. ఆతరవాత నిద్రమత్తుతో జోగుతున్నవారు నిద్రకు వుపక్రమించగా, శివదత్తుడూ, మరొక సైనికుడూ కావలి కూర్చున్నారు. తూర్పున ఎర్రని రక్తకాంతులతో అరుణోదయం అయేవరకూ, ఆ ప్రాంతాల చెప్పదగిన మరే దుర్ఘటనా జరగలేదు.

బాగా తెలతెల్లవారగానే, మందరదేవుడూ సైనికులూ కళ్ళుతెరిచారు. తాము వున్న ప్రాంతమంతా ఒకానొక కీకారణ్యమని వాళ్ళకు తెలిసిపోయింది. ఆకాశంలోకి చొచ్చుకుపోయిన పెద్ద మానులూ, వాటి మొదళ్ళను కప్పివేస్తూ పెరిగిన అనేక చిన్నాపెద్ద చెట్లూ, పొదలూ; విచ్చలవిడిగా అల్లుకుపోయిన తీగలూ, వాటిమీద గెంతుతూ పరుగెత్తే కోతులూ, అరుస్తూ ఎగురుతున్న వివిధరకాల పక్షులూ-అంతా భయోత్సాహాలను కలిగిస్తున్నది.

"మందరదేవా, ఇక మనం రాత్రి వదలిపెట్టిన పనికి ఉపక్రమించవచ్చు. మీబాణం ఎటుగా పోయి, సుమారు ఎంత దూరంలో ఆ వికృతజంతువ్ని తాకిందో మీరు చెప్పగలరనుకుంటాను?" అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు ముందు దారితీశాడు. చెట్లతీగలనూ, పొదలనూ తప్పించుకుంటూ అందరూ వంద గజాల దూరం వెళ్ళేసరికి, అక్కడ పచ్చని ఆకులపై కొన్ని నెత్తురు మరకలు కనిపించినై.

—(ఇంకా వుంది)



# వింత మందహాసం

పంతం విడవని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు గట్టిగా నవ్వి, "వెర్రిరాజా! ఎక్కడైనా రాజులు తమ అపదలను తప్పుకోవటానికి ఇతరులను బలిచేస్తారుగాని, ఇతరుల కోసం బాధపడరు. చంద్రావలోకుడి సంగతి వినలేదా? ఆ కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా కథ ప్రారంభించాడు:

పూర్వం చిత్రకూటాన్ని చంద్రావలోకుడనే రాజు పరిపాలించాడు. అతడు ప్రజల ఆదరాన్ని ఎంతగానో సంపాదించుకుని, అందరినీ స్నేహితుల్లాగా చూసుకుంటూ సుఖంగా కాలంగడుపుతూ వచ్చాడు. అయితే అతనికి ఒక్కటే కొరత. అదేమిటంటే, అన్నివిధాలా తనకు అనుకూలవతి అయిన కన్య దొరకక అతను పెళ్ళాడలేదు.

బేతాళ కథలు



తనకు భార్య లేదన్న చింత కలిగినప్పుడల్లా చంద్రావలోకుడు వేటకు బయలుదేరి, వేట ఉత్సాహంలో తన విచారాన్ని మరిచి పోతూండే వాడు.

ఒకసారి ఇదేవిధంగా రాజు వేటకు బయలుదేరి, కనపడిన దుష్టమృగాన్నల్లా వేటాడుతూ, కీకారణ్యం మధ్యకు గుర్రాన్ని పరిగెత్తించాడు. ఆవిధంగా ఆయన అరణ్యంవెంబడి పోగా పోగా ఒక వనం వచ్చింది. మరికొంత దూరాన ఒక కొలను కనిపించింది. చంద్రావలోకుడు అక్కడ గుర్రం దిగి, దాహం తీర్చుకుని ఒక చెట్టు నీడను విశ్రాంతి తీసుకోసాగాడు.

ఇంతలో వనంలోనుంచి కొలనుకేసి ఒక అపురూప సౌందర్యవతి అయిన మునికన్య స్నానంచేసే ఉద్దేశంతో వచ్చింది. ఆమెను చూడగానే రాజుకు పరమానందమయింది. ఆమె తనకు అన్నివిధాలా తగిన భార్య అవుతుం దనుకున్నాడు. కాని ఇంతలోనే ఆ అమ్మాయి రాజును చూసి సిగ్గుపడి, వెనక్కు తిరిగి వెళ్ళిపోసాగింది.

రాజు ఆమె వెనకాలే బయలుదేరి ఒక ఆశ్రమం చేరాడు. అది ఒక ముని ఆశ్రమం. రాజు చూసిన కన్య ఆ ముని పెంపుడు కుమార్తె. ఆమె పేరు ఇందీవరప్రభ. రాజు మహాముని దర్శనం చేసుకుని, తాను వేటకై వచ్చిన సంగతి తెలియ జెప్పాడు. అది విని ముని, "నాయనా, నిష్కారణంగా నీ శక్తిని వేటకై ఎందుకు ధారపోస్తావు? నీరాజ్యం చూసుకో, సత్కర్మలు చెయ్యి," అని హితవు చెప్పాడు.

అప్పుడు చంద్రావలోకుడు, "స్వామీ, నేనింకా గృహస్థును కాను. నాకు తగిన కన్య దొరకలేదు. మీ ఆశ్రమంలో ఇంతకు ముందే ఇందీవరప్రభను చూశాను. మీరు అనుగ్రహించి ఆమెను నాకిచ్చి పెళ్ళి చేసినట్టయితే, ఈ వేట మాని సుఖంగా రాజ్యం చేసుకుంటాను," అన్నాడు.

ముని ఇందీవరప్రభ ఉద్దేశం కూడా తెలుసుకున్న మీదట వారిద్దరికీ తానే వివాహం చేశాడు. వివాహం కాగానే రాజు తన భార్యతోసహా రాజధానికి ప్రయాణ మైనాడు. వారు గుర్రంమీద కొంతదూరం వచ్చేసరికి పొద్దుకూకింది. ఆ రాత్రి విశ్ర మించటానికి వారి కొక రావిచెట్టూ, దాని కింద తివాసీలాటి పచ్చిక ప్రదేశమూ, పక్కనే చక్కని తామరకొలనూ కని పించాయి. ఇద్దరూ కొలనులో నీరు తాగి, చెట్టుకింద పడుకుని నిద్రపోయారు.




తెల్లవారేవేళకు భయంకరమైన అరు పులు విని, ఇద్దరూ తుళ్లిపడి లేచారు. వారి సమీపంలోనే బ్రహ్మరాక్షసి ఒకడు నిలబడి, "ఓరీ దుర్మదాంధా! నేనెవరో ఎరుగుదువా? నా పేరు జ్వాలాముఖుడు. నన్నుచూసి దేవతలే భయపడతారు. ఇది నా రావిచెట్టు. నేను బయటికి వెళ్లిన సమ యంలో నా అనుజ్ఞ లేకుండా ఈ చెట్టుకింద పడుకున్నావా? నిన్నేంచేస్తానో చూడు!" అని రాజుపై హుంకరించాడు.

"అయ్యా, తెలియక అపరాధంచేశాను. నన్ను క్షమించు. జరిగిన తప్పుకు ఏదన్నా ప్రాయశ్చిత్తం ఉంటే చేస్తాను!" అన్నాడు చంద్రావలోకుడు.

"అయితే, ఏడు రోజులలోగా నాకు ఏడేళ్ల కుర్రవాణ్ణి తెచ్చి బలిపెట్టు! ఈ బలికి కుర్రవాడు బుద్ధిపూర్వకంగా ఒప్పు కోవాలి! వాడి శిరస్సు నీ చేతితోనే తెగ వెయ్యాలి: ఆ సమయంలో వాడి తల్లి దండ్రులే స్వయంగా వాడి కాళ్ళూ, చేతులూ గట్టిగా పట్టుకోవాలి! దీనికి ఏమాత్రం భిన్నంగా జరిగినా నేను ఒప్పను. నీ ప్రాణం తీసితీరుతాను, తెలిసిందా?" అన్నాడు జ్వాలాముఖుడు.

గత్యంతరం లేక రాజు రాక్షసుడు కోరిన ప్రకారం బలి ఇవ్వటానికి సమ్మతించి, భార్యతోసహా గుర్రంమీద బయలుదేరి, తన

పరివారాన్ని కలుసుకుని చిత్రకూటానికి తిరిగి వెళ్ళాడు.

రాజు పెళ్లాడాడన్న వార్త విని సంతోషించిన మంత్రులు, జ్వాలాముఖుడి వృత్తాంతంవిని విచారంలో మునిగిపోయారు. అప్పుడు సుమతి అనే పెద్దమంత్రి, "మహారాజా, మీరు చింతించకండి. బలి అయేటందుకు తగిన కుర్రవాణ్ణి నేను ఏదోవిధంగా సంపాదిస్తాను!" అన్నాడు.

వెంటనే ఆయన శిల్పులను పిలిపించి, ఏడేళ్ళ కుర్రవాడి ప్రమాణంలో ఒక బంగారు పోతవిగ్రహం తయారుచేయమని అజ్ఞాపించాడు. ఆ విగ్రహం వెంటనే సిద్ధమయింది. తరవాత మంత్రి దానిని ఒక బండీలో పెట్టించి, కొందరు భటులతో ఈ విధంగా చెప్పాడు:

"మీరీ విగ్రహాన్ని ఊరూరు తిప్పుతూ చాటింపు వేయండి. ఏడేళ్ళ కుర్రవాడు ఎవడైనా సరే బుద్ధిపూర్వకంగా బ్రహ్మరాక్షసికి బలికావాలి. వాణ్ణి బలి ఇచ్చేటప్పుడు వాడి తలిదండ్రులు వాడి కాళ్ళుచేతులు పట్టుకోవాలి. ఇందుకు సమ్మతించిన వారికి ఈ బంగారు పోతవిగ్రహం బహుమానంగా ఇవ్వబడుతుంది, అని చాటించండి!"

రాజభటులు ఆ ప్రకారమే చాటింపు చేస్తూ విగ్రహాన్ని ఊళ్ళవెంట తిప్పసాగారు.



ఒక అగ్రహారంలో ఒక ఏడేళ్ళ బ్రాహ్మణ బాలుడు ఈ చాటింపు విని, "అయ్యా, నేను రాక్షసుడికి బలి అవుతాను. నా తలిదండ్రులనుకూడా ఒప్పిస్తాను. మాయింటికి రండి," అని రాజభటులను కోరి, తన వెంట తీసుకుపోయాడు.

వాడు తన నిశ్చయాన్ని తల్లిదండ్రులకు చెప్పి బలికి ఒప్పుకోమన్నాడు. మొదట వాళ్లిద్దరూ సుతరామూ ఒప్పలేదు. అప్పుడు వాడు, "అమ్మా! నాన్నా! మనం ఘోరమైన దారిద్ర్యం అనుభవిస్తున్నాం. నావల్ల మీకు కలుగుతున్న ఆనందం ఏమైనా ఉందా ? నేనివాళ కాకపోతే రేపైనా పోయేవాణ్ణే. ముందు దారిద్ర్యం వదిలించుకోండి. తరవాత ఇంకా కొడుకులను కని వాళ్లను చూసి ఆనందించవచ్చు. ఇటువంటి అవకాశం మళ్ళీ దొరకదు," అని బోధించాడు. చాలాసేపు కొడుకు ఈవిధంగా బోధించిన మీదట తల్లిదండ్రులు సమ్మతించారు. రాజభటులు బంగారు విగ్రహాన్ని కుర్రవాడి తల్లిదండ్రుల కిచ్చి, వారినీ, కుర్రవాణ్ణీ బండీలో ఎక్కించుకుని రాజువద్దకు వెళ్ళారు.

రాజు ఆ కుర్రవాణ్ణీ, వాడి తల్లిదండ్రులనూ వెంటబెట్టుకుని జ్వాలాముఖుడుండే రావిచెట్టువద్దకు వెళ్లి కేకపెట్టాడు. బ్రహ్మరాక్షసి వచ్చాడు.



"అయ్యా, నీవు కోరిన గడువులో బలి తెచ్చాను," అన్నాడు రాజు.

"అలాగా, అయితే వాడి తల నరుకు!" అన్నాడు బ్రహ్మరాక్షసి.

కుర్రవాడి తల్లిదండ్రులు వాడి కాళ్ళు చేతులు గట్టిగా పట్టుకున్నారు. వాడి తల నరకటానికి రాజు కత్తి ఎత్తాడు. ఆ సమయంలో ఆ కుర్రవాడు నవ్వాడు. వెంటనే బ్రహ్మరాక్షసి కుర్రవాణ్ణి ఎత్తుకుని ముద్దాడి "ఇంటికి తిరిగిపో, బాబూ!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, చావనున్న సమయంలో ఆ కుర్రవాడెందుకు నవ్వాడు? బ్రహ్మరాక్షసి ఆ కుర్రవాణ్ణి బలి తీసుకోక, ఎందుకు విడిచిపుచ్చాడు? సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలి పోతుంది," అన్నాడు.

"చిన్నపిల్లలకు భయం కలిగినప్పుడు తల్లిదండ్రులు అదుకుని భయం పోగొడతారు. ఏ పరిస్థితులలోనైనా మనుషులకు రక్షకుడు రాజు. రాజుకూడా కాపాడలేని పరిస్థితిలో ఏ అమానుష శక్తి అయినా వచ్చి కాపాడాలి. ఈ కుర్రవాడు అపదలో ఉన్నాడు. ఈ అపదనుంచి అతన్ని తల్లి దండ్రులు రక్షించరు; వాళ్లు అతని కాళ్లు చేతులు పట్టుకుని బలికి సాయపడుతున్నారు. రాజు రక్షించడు; ఎందుచేతనంటే బలి ఇస్తున్నవాడు రాజే. సమీపంలో బ్రహ్మరాక్షసిరూపంలో ఒక అమానుష శక్తి ఉన్నది, కాని అదీ రక్షించదు. ఎందుకంటే బలిపుచ్చుకుంటున్నది అదే! ఈ విధంగా తనకు మూడు రక్షలలో ఒక్కటీ లేకుండా పోయినందుకు కుర్రాడు నవ్వాడు. ఆ నవ్వు అంతర్యం గ్రహించి బ్రహ్మరాక్షసి ఆ కుర్రాడి ప్రాణాన్ని కాపాడాడు," అన్నాడు విక్రమార్కుడు.

ఈవిధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా తిరిగి వెళ్లి మళ్లీ చెట్టెక్కాడు.





# బందిపోటు

పర్షియాలోని నిషాపూరు నగరంలో షమ్స్ అనే యువకుడుండేవాడు. అతనికి దూర దేశాలు పోయి ధనార్జన చేయాలనే ఉద్దేశం కలిగింది. అతను ఒక బిడారువెంట ప్రయాణమైనాడు. బిడారు కొంతకాలం ప్రయాణించి ఒక ఎడారి ప్రవేశించింది.

షమ్స్ బిడారు ప్రయాణా లెరగనివాడు. అందుచేత ఒకనాటి సాయంకాలం అతను మజిలీలో భోజనంచేసి, చిన్న కునుకు తీశాడు. అతను నిద్ర మేలుకునేసరికి మర్నాడు తెల్లవారింది. ఈలోపుగా బిడారు చాలాదూరం వెళ్లిపోయింది.

ఒంటరిగాడైపోయిన షమ్స్‌కు ఏం చెయ్యాలో తెలియలేదు. అతను దారీ తెన్నూ, తిండీ నీళ్ళూ లేకుండా, ఒక్క మనిషిని చూడకుండా ఆ రోజల్లా ప్రయాణంచేశాడు. మర్నాడు అతనికి అంత దూరాన ఎవడో తనకేసి వస్తూ కనిపించాడు.

దురదృష్టవశాత్తూ ఆ వచ్చేవాడు ఎడారిలో ఉండే గజదొంగలలో ఒకడు; గొప్ప సాహసి, దయాదాక్షిణ్యాలు లేనివాడు. వాడు షమ్స్‌మీద పడి, అతని చేతులు కట్టి, అతన్ని ఇసకలో ఈడ్చుకుంటూ తన గుర్రంమీద బయలుదేరాడు. ఇంతలో ఒక జలాశయం వచ్చింది. గజదొంగ గుర్రం దిగి, తన కత్తిని పక్కన పెట్టి, దాహం తాగటానికి కూచున్నాడు. షమ్స్ ఎలాగూ ప్రాణాలపై ఆశ వదులుకుని వుండటంచేత, కట్టివున్న చేతులతోనే కత్తి తీసుకుని గజదొంగను డొక్కలో పొడిచాడు. గజదొంగ అక్కడే ప్రాణాలు విడిచాడు.

తరవాత షమ్స్ ఆ కత్తితోనే తన చేతి కట్లు తెగగోసి, చచ్చిపోయిన దొంగయొక్క గుర్రం ఎక్కి, ఇంకా ఎన్నికష్టాలు ఎదుర్కోవాలో నని భయపడుతూ బయలుదేరాడు. అయితే, అతనికి ఎడారిలో దారి తెలియదు

సి. నాగేశ్వరరావు

గనక, గుర్రం కళ్ళాలు వదిలి, గుర్రాన్ని దాని ఇష్టంవచ్చిన వేపుగా పోనిచ్చాడు. అది వెళ్ళివెళ్ళి కొన్ని గుడారాల మధ్యకు చేరుకున్నది. అది బందిపోటు దొంగల శిబిరం. ఆ బందిపోటు దొంగలకు నాయకుడు షమ్సుచేత చంపబడినవాడే!

బందిపోటు దొంగలు దూరాన గుర్రాన్ని చూసి, తమ నాయకుడే వస్తున్నాడనుకున్నారు. కాని తమ ఉద్దేశం పొరపాటని తెలియగానే దొంగలందరూ షమ్సును చుట్టుముట్టి, "ఏం జరిగింది? నాయకుడెక్కడ? ఆయన గుర్రంమీద నువెందుకు వచ్చావు? నువ్వెవరు?" అని అడిగారు.

షమ్సు తెలివిగలవాడు. అతను యుక్తిగా ఒక కపటనాటకం ఆడాడు.

"అన్నలారా, నేనొక ప్రయాణీకుణ్ణి. మా బిడారు ఎడారిగుండా పోతూండగా మహాబల పరాక్రమ సంపన్నుడైన మీ నాయకుడు ఒంటరిగా మాపైన పడి ఎంతో మందిని చిత్రవధ చేసేశాడు. అయితే అఖరుకు అతన్ని అనేక వందలమంది చుట్టుముట్టి పట్టుకున్నారు. మాలో కొంతమందిమి అతని శౌర్యపరాక్రమాలకు ముచ్చటపడి, అతన్ని వదిలివెయ్య వలిసిందిగా వేడుకున్నాం. బిడారు నాయకుడు మా మాటలకు కొంచెం మెత్తబడాడు. కాని చచ్చి



పోయినవారి బంధువులు అతన్ని చంపి తీరాలనీ, అతను చేసిన హత్యలకు ప్రతీకారం జరిగితీరాలనీ పట్టుబట్టారు. దానిపై మేము, 'మీకు ప్రతీకారం జరగాలంటే హత్యలకు పరిహారంగా డబ్బు పుచ్చుకోండి! అంతేగాని అంత పరాక్రమవంతుణ్ణి చంపెయ్యవద్దు,' అన్నాం. దీనికి వారు అంగీకరించి, పదివేల దీనారాలు ఇచ్చే షరతుమీద అతన్ని వదిలిపెడతామన్నారు. మీ నాయకుడు అంత డబ్బూ తెచ్చి ఇస్తానన్నాడు. కాని అతను స్వయంగా వెళ్లటానికి ఎవరూ ఒప్పలేదు. ఇతరుల నెవరినైనా వెళ్ళమంటే, అందరూ తలా ఒక వంకా చెప్పారు. కొందరు తాము బడలి ఉన్నామనీ, మరి కొందరు దొంగల శిబిరానికి దారి తెలియదనీ అన్నారు. 'కావలిస్తే నా గుర్రంమీద వెళ్ళవచ్చు. అది నేరుగా మా శిబిరానికి వెళ్ళుతుంది,' అని మీ నాయకుడన్నాడు. అందుకుకూడా ఎవరూ సిద్ధంగా లేకపోవటం చూసి నేను బయలుదేరాను. అతను చెప్పినట్టే గుర్రం నన్ను నేరుగా మీదగ్గిరికి తెచ్చింది," అన్నాడు షమ్స్.

ఈ కథను నమ్మాలో, లేదో దొంగలు తేల్చుకోలేకపోయారు. ఇది చూసి షమ్స్, "నా మాటలు మీరు నమ్మనవసరంలేదు.



మీరు డబ్బు ఇవ్వటానికి సిద్ధంగా లేకపోతే నేను వచ్చిన దారినే పోతాను. కాని మీ నాయకుడు చచ్చినవాడే అనుకోండి. నా మాటలో మీకు విశ్వాసం వుంటే, నా చేతికి డబ్బివ్వ నవసరంకూడా లేదు. మీలో బలాఢ్యులు పదిమంది నావెంట రండి. మీ నాయకుణ్ణి చూపిస్తాను," అన్నాడు.

ఆ మాటతో దొంగల అనుమానం తీరింది. వారిలో బలాఢ్యులు పదిమంది పది గుర్రాలెక్కి, పది సంచులలోనూ పది వేల దీనారాలు నించుకుని షమ్సీవెంట బయలుదేరారు. ఎంత దూరాన వున్న బిడారునుకూడా వారు, గాలిలో ఎగిరే ధూళిని పట్టీ, ఎడారి మార్గాలను బట్టీ గుర్తించగలరు గనక, గుర్రాలమీద వేగంగా ప్రయాణం చేస్తూ కొద్దికాలంలోనే బిడారును కలుసుకున్నారు.

బిడారు అంతదూరాన వుండగానే షమ్సీ దొంగలతో, "మీరు కొంచెం నింపాదిగా రండి. నేను ముందు వెళ్ళి బిడారు నాయకుడితో, మీరు డబ్బు తెస్తున్నారనీ, మిమ్మల్ని పట్టుకోనవసరం లేదనీ చెబుతాను," అన్నాడు. దొంగలు ఒప్పుకున్నారు.

షమ్సీ బిడారును కలుసుకుని నాయకుడితో జరిగినదంతా చెప్పేశాడు. ఆయన షమ్సీ యుక్తికి సంతోషించి, దొంగలను దగ్గరకు రానిచ్చాడు.

దొంగలు సొమ్ముతోసహా దొరికిపోయారు. బిడారు నాయకుడు వారందరికీ మరణ దండన విధించి, వారు తెచ్చిన పదివేల దీనారాలూ షమ్సీ పుచ్చుకునేటట్టు తీర్పు చెప్పాడు. కాని షమ్సీ ఆ దొంగలను చంపవద్దనీ, నాయకుణ్ణి పోగొట్టుకున్న ఆ దొంగలు అంత ప్రమాదం చెయ్యరనీ అన్నాడు. అతన్ని మరి కొందరు ప్రయాణీకులు బలపరచటంవల్ల బిడారు నాయకుడు, దొంగతనాలు చేయమని దొంగలచేత ప్రమాణాలు చేయించి, వారిని విడిచిపుచ్చాడు.



# భూగోళం: పర్వతపంక్తులు

పర్వతాలు అతి విచిత్రమైనవి. పర్వతశ్రేణులు భూభాగమంతటా లేవు; అక్కడక్కడ మాత్రమే ఉన్నాయి. ఇవి మామూలు నేలను మించి ఎంతో ఎత్తుంటాయి. ఒకప్పుడు పర్వతాలకు రెక్కలుండేవనీ, అవి ఎగిరేవనీ, ఇంద్రుడు వాటి రెక్కలను తన వజ్రాయుధంతో తెగగొట్టగా అవి భూమిమీద పడిపోయాయనీ ఒక పురాణగాథ ఉన్నది. ఈ గాథ నిజంకాదు.

పర్వతాలు శిలామయమైనవని అందరికీ తెలుసు. కాని ఈ శిలలను పరిశోధించి చూసినట్టయితే ఒక వింతవిషయం బయటపడుతుంది: అదేమిటంటే, ఇవి అఖండ శిలలు కావు, ఏ సముద్రం అడుగుననో ఒక్కొక్క పొర చొప్పున పేరుకుని, నీటిఒత్తిడికీ, వేడికీ ఘనీభవించి ఏర్పడిన శిలలు. ఇది మనకెలా తెలుసునంటే, అనాదికాలపు జలచరాలశరీరాలు ఈ పర్వత శిలల పొరలసందున చిక్కి ఈనాటికీ కనిపిస్తాయి! ప్రపంచంలోకల్లా ఎత్తయిన హిమాలయ పర్వతపు శిలలలో కూడా ప్రాచీన జలచరశరీరాల శిథిలాలున్నాయి.

దీనినిబట్టి పర్వతాలు పయినుంచి వచ్చి భూమిపై పడలేదనీ, అడుగునుంచి పైకి లేచాయనీ స్పష్టమవుతున్నది. భూమిపై పొరలో రెండు వైపులనుంచి ఒత్తిడి సంభవించటంవల్ల ఆ మధ్యభాగంలో ఉన్న భూమి పొర ముడతలు ముడతలుగా పైకి లేస్తుంది. పర్వతపంక్తులన్నీ ఈవిధంగా పైకి లేచినవే. హిమాలయపర్వతాలు 6 కోట్ల సంవత్సరాలక్రితం పైకి పెరగనారంభించాయి. అవి ఇంకా పెరుగుతూ ఉండిఉండవచ్చు. వింధ్యపర్వతాలు అగస్త్యుడి దారికి అడ్డుగా లేచాయని మరొక పురాణగాథ ఉన్నది. పర్వతనిర్మాణాన్ని ఈగాథ మరింత వాస్తవంగా సూచిస్తున్నది.

భూమి పైపొరలో ఏదో ఒక విధమైన తీవ్రసంక్షోభం కలిగినప్పుడే పర్వతాలు పైకి లేస్తాయి. హిమాలయపర్వతాల నిర్మాణానికి కారణభూతమైన సంక్షోభమే యూరప్‌లో ఆల్ప్స్‌ను ఉత్తర అమెరికాలో రాకీ, ఉత్తర ఆఫ్రికాలో అట్లాస్ పర్వతాలనూ నిర్మించింది.

ఒకసారి పుట్టినపర్వతాలు పుట్టినట్లే ఎల్లకాలమూ ఉండిపోవు. వానలకు అవి క్రమంగా అరిగిపోతాయి. అరిగిపోయిన పర్వతశిలలు రాతిపలుకులై, ఇసుకగా అయి, బంద్రుగా అయి, మట్టిగా మారిపోయి నదీ ప్రవాహాలవెంబడి సముద్రాన్ని చేరి, ఆ సముద్రం అడుగున తేరుకోవటం జరుగుతుంది. ఈవిధంగా సముద్రగర్భంలో భావిపర్వతపంక్తుల ఉత్పత్తి సాగుతోంది.

హిమాలయాలకన్న అనేకకోట్ల ఏళ్లుముందే ఏర్పడి కాలక్రమాన దాదాపు నేలమట్టానికి అరిగిపోయిన పర్వతాలు ఈనాడు అక్కడక్కడా చూడవచ్చు. ఇటువంటి పర్వతాల శిలలలో ప్రాణుల కళేబరాలు దొరకవు. ఒక్కొక్కప్పుడు ఇవి అఖండ శిలలుగాకూడా ఉంటాయి.



# మాటకారి యోధుడు

ఒకప్పుడు రోముదేశంలో ఫిలోమినస్ అనే చక్రవర్తి పరిపాలించాడు. ఈయనకు అందగత్తె అయిన కుమార్తె ఉండేది. రాజసౌధంలోనే ఉంటూ ఉండిన ఒక యోధుడు రాజకుమార్తెను ప్రేమించాడు. ఒకనాడు ఆ యోధుడికి రాజకుమార్తెతో ఒంటరిగా మాట్లాడే అవకాశం దొరికింది. అప్పుడతను సాహసించి ఆమెకు తన ప్రేమను వెల్లడించాడు.

రాజకుమార్తె ఆగ్రహించక, "నువు నీ మనసులో ఉన్నది చెప్పావు గనక, నేను కూడా నా మనసులో మాట నీకు చెప్పేస్తున్నాను. నేనుకూడా చాలా కాలంగా నిన్ను ప్రేమిస్తున్నమాట నిజం!" అన్నది.

ఈ మాట విని యోధుడు చాలా సంతోషించాడు. అతను రాజకుమార్తెతో, "నేను రేపో ఎల్లుండో బయలుదేరి దేశాంతరాలకు వెళుతున్నాను. తిరిగి సరిగా ఏడేళ్లకు వస్తాను. ఈలోపల నా ప్రాణం పోయినా ఇంకొకతెను పెళ్లాడను. నువుకూడా నా కోసం అంతదాకా వేచి ఉంటానని ప్రమాణం చెయ్యి. ఒకవేళ నేను గడువుతీరిన మర్నాటికల్లా రాకపోతే, నేను చనిపోయానని భావించి మరెవరినైనా పెళ్లిచేసుకో!" అన్నాడు.

రాజకుమార్తె అతని చేతిలో చెయ్యివేసి ఆప్రకారమే ప్రమాణం చేసింది. మర్నాడే ఆ యోధుడు దూరదేశాలకు బయలుదేరి వెళ్లిపోయాడు. ఆనాడే చక్రవర్తికి హంగరీదేశపురాజు, "మీ కుమార్తెను పెళ్ళాడ గోరుతున్నాను," అని కబురు చేశాడు.

చక్రవర్తి తన కుమార్తెను పిలిపించి, "అమ్మా, హంగరీ రాజు నిన్ను పెళ్ళాడతానని కబురు చేశాడు. మరి నీ అభిప్రాయమేమిటి?" అని అడిగాడు.

"నాన్నా, మరి ఏడేళ్లపాటు నేను కన్యగానే ఉండాలని నిశ్చయం చేసుకున్నాను.

టి. బలరామయ్య

ఆ తరవాత ఆయన ఇంకా నన్ను పెళ్ళాడ గోరినట్టయితే నా ఉద్దేశం చెబుతాను," అన్నది రాజకుమార్తె.

చక్రవర్తి హంగరీ రాజుకు తన కుమార్తె అభిప్రాయం తెలియజేశాడు. "ఏడేళ్లు ఆగి అప్పుడే మీ కుమార్తెను వివాహమాడ వస్తాను," అని హంగరీరాజు కబురుచేశాడు.

ఏడేళ్ళు గడిచాయి. రాజకుమార్తె యోధుడికోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నది. రేపటిలోగా అతను రాకపోతే, హంగరీరాజు వచ్చి తనను పెళ్ళాడతాడు. తాను ఆయనను పెళ్లాడితీరాలి!



గడువు ముగిసిననాడే హంగరీరాజు రోమునగరానికి ప్రయాణమైనాడు. దారిలో అతనికొక యోధుడు కలిశాడు. అతను కూడా రోమునగరవాసేననీ, అక్కడికే ప్రయాణమై పోతున్నాడనీ తెలిసి, హంగరీ రాజు చాలా సంతోషించాడు.

వారిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ ప్రయాణిస్తుండగా మధ్య దారిలో వానకొట్టి, హంగరీ రాజు దుస్తులన్నీ తడిసి ముద్ద అయిపోయాయి.

"ప్రభూ, తమరు తమ ఇంటిని వెంట పెట్టుకు రావలిసింది. పొరపాటు చేశారు!" అన్నాడు యోధుడు.

"ఏమిటోయ్, నువ్వనేది? మా యిల్లు కాస్తదీ, కూస్తదీ అనుకున్నావా, వెంట పెట్టుకు రావటానికి? నీవు చాలా అమాయకుడల్లే ఉన్నావు!" అన్నాడు రాజు.

వారు కొంతదూరం వెళ్ళాక ఒక నది అడ్డు తగిలింది. రాజు తన గుర్రాన్ని అదిలించి నీటిలోకి ఉరికించాడు. గుర్రం పల్లంలోకి దిగి రాజును ముంచినంత పని చేసింది. యోధుడు ఉపాయంగా ఆ లోతును తప్పించి, రాజుగారి వెనకాలే అవతలి ఒడ్డుకు చేరి, రాజుతో, "ప్రభూ, తమరు వంతెనగాని వెంటబెట్టుకు రాక పోయారా?" అన్నాడు.

"నువు నిజంగా పిచ్చివాడులాగున్నావే? ఈ నదిని దాటే వంతెనను ఎవడన్నా వెంట బెట్టుకురాగలడా?" అన్నాడు హంగరీరాజు.

"బాబూ, ఒకరు మూఢుడు కావటం మరొకరికి లాభం," అన్నాడు యోధుడు.

మరికొంత దూరం వెళ్ళాక రాజు యోధుడితో, "ఏమోయ్, ఇప్పుడు వేళ ఏపాటి అయిఉంటుంది?" అన్నాడు.

"కడుపులో ఆకలిగా ఉంటే భోజనాల వేళే, బాబూ! నా భోజనంలో కాస్తవంతు పుచ్చుకుంటారా?" అన్నాడు యోధుడు.

"ఎబ్బే, నా కేటువంటి అభ్యంతరమూ లేదు," అన్నాడు రాజు.

ఒక చక్కని వనంలో ఇద్దరూ కూచుని యోధుడు తెచ్చుకున్న ఆహారం ఆర గించారు. "బాబూ, తమరు అమ్మనూ, నాన్ననూ వెంటతెచ్చుకుని ఉండవలి సింది!" అన్నాడు యోధుడు.

"ఇది మరీబాగుంది! మా తండ్రిగారు ఏనాడో గతించారు. మా తల్లిగారు మంచం పట్టిన వృద్ధు. ఆవిణ్ణి ఎలా వెంట తీసుకు రాను? నీకు కాస్తయినా బుద్ధి లేదల్లే ఉందేమిటి?" అన్నాడు రాజు.

"నిజం నిలకడమీద తెలుస్తుందిలెండి!" అన్నాడు యోధుడు. మరి కాస్సేపటికల్లా వారు రోమునగరం ప్రవేశించారు.



"ప్రభూ, నాకు సెలవిప్పించండి. తమరు రాజవీధివెంట వెడతారు కాబోలు. నాది అడ్డదారి. ఏడేళ్లక్రితం వల వేసి వచ్చాను. అది ఏ స్థితిలో ఉందో వెళ్ళి చూసుకోవాలి," అన్నాడు యోధుడు.

"సరే, వెళ్లిరా!" అంటూ హంగరీరాజు ముందుకు సాగాడు. ఆయనకు చక్రవర్తి ఘనమైన స్వాగతం ఇచ్చాడు. అతిథి అయిన హంగరీరాజు స్నానంచేసి చక్రవర్తి వెంట భోజనానికి కూచుని, మాటల సందర్భంలో, "దారిలో నాకొక యోధుడు తగిలాడు. పాపం, వెర్రిబాగులవాడు! వాన కురిసి నా దుస్తులు తడిసిపోతే, ఇల్లు వెంట తెచ్చుకోలేదేమని అడిగాడు," అంటూ గట్టిగా నవ్వాడు.

"వాన కురిసినప్పుడు వాడేం చేశాడు?" అని అడిగాడు చక్రవర్తి.

"మీద ఉన్న దుప్పటి కప్పేసుకున్నాడు," అన్నాడు హంగరీరాజు.

"ఇకనేం? వాడి ఉద్దేశం, మీరుకూడా వెంట దుప్పటి తెచ్చుకుని ఉండవలసిందనే. అది అర్థంలేని మాట కాదు!" అన్నాడు చక్రవర్తి.

తరవాత తాము నదివద్దకు రావటమూ, తాను గుర్రాన్ని అదిలిస్తే అది తనను నీటిలో ముంచినంత పని చెయ్యటమూ,



వెంట వంతెన తెచ్చుకోలేదేమని యోధుడు అడగటమూ గురించి హంగరీరాజు చక్రవర్తికి వివరించి చెప్పాడు.

"అదీ అర్థంగల మాటే! ముందు దిగిలోతు చూసేటందుకు నౌకర్లను తెచ్చుకుని ఉండవలిసిందని ఆ యోధుడి ఉద్దేశం," అన్నాడు చక్రవర్తి.

"వాడు నన్ను తనతోబాటు భోజనం చెయ్యమని పిలిచి, నేను ఒప్పుకుని భోజనం చేశాక, 'తమరు అమ్మనూ, నాన్ననూ వెంట తెచ్చుకుని ఉండవలిసింది', అన్నాడు. అది అర్థంలేని మాటకాదా?" అని అడిగాడు హంగరీరాజు.

"ఎంతమాత్రం కాదు. అమ్మా నాన్నా అంటే అన్నపానీయాలని వాడి అర్థం. వాటిని వాడు తెచ్చుకున్నాడు, మీరు తెచ్చుకోలేదు," అన్నాడు చక్రవర్తి.

"అయితే, వాడు వెళ్ళిపోయేటప్పుడు, తాను ఏడేళ్ళక్రితం ఒక వల వేశాననీ, అది ఏ స్థితిలో ఉన్నదీ వెంటనే వెళ్ళి చూసుకోవాలనీ అన్నాడు. దానికికూడా ఏదైనా అర్థం ఉందేమో!" అన్నాడు హంగరీరాజు.

"వాడామాట అన్నాడూ?" అంటూ చక్రవర్తి ఆత్రంగా లేచాడు. ఏడేళ్ళు అనగానే ఆయనకు తన కుమార్తె అడిగిన గడువు జ్ఞాపకం వచ్చింది. ఆయన గబగబా అంతఃపురంలోకి పరిగెత్తాడు. హంగరీరాజు ఆయనవెంట పరుగెత్తాడు. కాని చక్రవర్తి అదుర్దాకు కారణమేమిటో హంగరీరాజుకు వెంటనే అర్థంకాలేదు.

చక్రవర్తి భయపడ్డంతా అయింది. రాజకుమార్తె జాడ లేదు. ఆమెను యోధుడు అప్పుడే వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు.

"నువు పెళ్ళాడటానికి వచ్చిన నా కూతుర్ని ఆ యోధుడు నీకన్న ముందే కాజేసుకు పోయాడు. మీ ఇద్దరిలో ఎవరు మూఢుడో ఇప్పుడైనా తెలిసిందా?" అన్నాడు చక్రవర్తి హంగరీరాజుతో.



# నావికుడు సింద్‌బాద్

హారూన్ అల్‌రషీద్ ఖలీఫాగా ఉండే కాలంలో బగ్దాద్ నగరంలో సింద్‌బాద్ అనే పేదవాడు ఒకడుండేవాడు. వాడు బరువులు మోసి, ఆ కూలి డబ్బులతో తన పొట్ట నింపుకుంటూ ఉండేవాడు. ఒకనాడు వాడు మండుటెండలో పెద్ద బరువు ఎత్తుకుని ఒక ధనికుడి ఇంటి సమీపానికి వచ్చాడు. ఆ ఇంటిముందు చక్కగా ఊడ్చి పన్నీరు చల్లటంచేత అక్కడ చల్లగా, సుఖంగా ఉన్నది. మార్గస్థులు విశ్రాంతి తీసుకోటానికని ఇంటి బయట ఒక బల్ల వేసి ఉన్నది. అందుచేత సింద్‌బాద్ తన బరువు కింద దింపుకుని, బల్లమీద చతికిలబడి, సువాసనతో కూడిన చల్లగాలి అనుభవించ సాగాడు. వాడికి లోపలినుంచి చక్కని జంత్రగాత్ర సంగీతమూ, కోయిలలూ, చిలుకలూ, గోరువంకలూ మొదలైన పక్షుల అరుపులూ వినవచ్చాయి. కూలిచేసుకునే సింద్‌బాద్ పరమానందంచెంది వాకిలిగుండా లోపలికి తొంగి చూశాడు. లోపల మనోహరమైన ఉద్యానవనం ఉన్నది. అందులో అనేకమంది బానిసలూ, నౌకర్లూ, అతిథులూ కనిపించారు.

ప్రస్తావన

CHITRA

అంతేకాదు, రకరకాల వంటకాల వాసనలూ, పానీయాల వాసనలూ సిందబాద్ వద్దకు గాలివెంట వచ్చాయి. అటువంటి భూలోక స్వర్గాన్ని వాడెన్నడూ కలలోకూడా ఊహించివుండలేదు. శరీరశ్రమ చేసి ఏది దొరికినా తిని సంతోషించే ఆ సిందబాద్‌కు ఆ ఆవరణలో వాళ్ళంతా దేవతలుగా తోచారు. వాడు నిట్టూర్చి "ఓ అల్లా! నీ కరుణామృతం ఎవరిపై ప్రవహిస్తుందో ఈ అల్పుడికెట్లా తెలుస్తుంది? ఈ ఇల్లు గల పెద్దమనిషికి ఇంత సుఖమైన భోజనమూ, పానీయాలూ, సమస్త వైభోగాలూ సమకూర్చి, నన్ను ఏమీ లేని దౌర్భాగ్యుడుగా ఉంచావు!" అని అల్లాకు విన్నవించుకున్నాడు. తరవాత వాడు తన దారిద్ర్యంగురించి అప్పటికప్పుడు పాటలు కట్టి, గొంతెత్తి పాడసాగాడు.

వాడు అట్లా కాస్సేపు పాడిన తరవాత బల్లమీదినుంచి లేచి బరువు మళ్ళీ ఎత్తుకోబోతూండగా, వాకిలివద్దకు ఒక బానిస వచ్చి వాడితో, "యజమాని నిన్ను లోపలికి రమ్మంటున్నారు. నావెంట రా!" అన్నాడు. బరువులు మోసేవాడికి భయంవేసింది. వాడు ఏవిధంగానైనా లోపలికి వెళ్లకుండా తప్పించుకుందామని ఏవో సాకులు చెప్పాడు గాని, లాభం లేకపోయింది. చివరకు వాడు



తన బరువును వాకిలివద్ద కావలిఉండే వాడికి వప్పగించి, భయపడుతూ బానిస వెంట లోపలికి వెళ్లాడు.

భవనం లోపలిభాగం భూలోక వైకుంఠంగా ఉంది. ఇంటినిండా గొప్పగొప్ప వాళ్లంతా ఆతిథ్యం స్వీకరిస్తున్నారు. ఎక్కడ చూసినా అందమైన పువ్వులున్నాయి. రకరకాల అత్తర్లు ఘుమాయిస్తున్నాయి. బల్లల మీద కనీవినీ ఎరగని వంటకాలన్నీ వడ్డించి ఉన్నాయి. అతిథులందరి మధ్యా ఒక వృద్ధుడు తెల్లని గడ్డంతో, ఠీవిగా కూచుని ఉన్నాడు. ఆయన ముఖం చాలా అందంగా కళగలిగి ఉన్నది.

బరువులు మోసేవాడు తన కళ్లను తానే నమ్మలేక, "నేను కలగంటున్నానో, లేక ఇది ఇంద్రలోకమో!" అనుకుంటూ అందరికీ సలాములు చేసి, మర్యాదగా చేతులు కట్టుకుని తల వంచుకుని నిలబడ్డాడు. వృద్ధుడు అతన్ని ఆదరంతో తనదగ్గిరికి వచ్చి కూచోమన్నాడు. అతని ముందు ఆహార పదార్థాలు తెచ్చి పెట్టారు. అతను భోజనం ముగించి చెయ్యి కడుక్కున్నదాకా వృద్ధుడు ఒక్క ప్రశ్నకూడా వెయ్యలేదు. తరవాత ఆయన, "నాయనా, నువ్విప్పుడు నా అతిథివి. బిడియపడక ఈపూటకు నీయిష్టంవచ్చినట్టు ఆనందించు. నీపేరేమిటి?" అని అడిగాడు.



"బాబూ, నేను కొద్ది కూలీకి ఘనమైన బరువులు మోస్తూంటాను. నన్ను సింద్‌బాద్ అని పిలుస్తారు!" అన్నాడు బరువులు మోసేవాడు వినయంగా.

వృద్ధుడు నవ్వి, "నాపేరుకూడా సింద్ బాదేసుమా—నావికుడు సింద్‌బాద్...నిన్ను పిలిపించటానికి కారణమేమంటే నువ్వింతకుపూర్వం పాడిన చక్కని పాటలు. వాటిని మళ్ళీ వినాలనివుంది," అన్నాడు.

బరువులు మోసేవాడు సిగ్గుపడుతూ, "బాబూ, నేను పేదవాణ్ణి, మొరటువాణ్ణి. అందుచేత అలాటి పాటలు పాడాను. దుఃఖం నాచేత అటువంటి పాటలు పాడించింది. తమరు నన్ను క్షమించాలి!" అన్నాడు.

"నువ్వా పాటలకు సిగ్గు చెందవలసిన పని ఏమాత్రమూ లేదు. నువు నా సోదరుడి వంటివాడివి. ఆ పాటలు నా చెవులకు చాలా ఆనందం కలిగించాయి. వాటిని మరొకసారి దయచేసి పాడు!" అన్నాడు నావికుడు సింద్‌బాద్. బరువులు మోసేవాడు గొంతెత్తి పాడాడు.

తరవాత వృద్ధుడిలా అన్నాడు: "నాది కూడా అతి విచిత్రమైన కథే. దానిని నీకు చెబుతాను. నేనీస్థితికి రావటానికి పూర్వం చాలా బాధలు పడ్డాను. ఆ సంగతి నా కథ వింటే నీకే తెలుస్తుంది. నమ్మశక్యంకాని శ్రమలు పడి, ప్రమాదాల నెదుర్కొని, దుర దృష్టాలపాలై, యాతనలను అనుభవించి సంపాదించిన డబ్బుతో ఈ ముసలితనంలో సుఖపడుతున్నాను. నేను ఏడుసార్లు సముద్రాలపై ప్రయాణాలుచేశాను. ఆ సముద్ర యానాలలో నాకు జరిగిన అనుభవాలు విన్నవాళ్ళు నిర్ఘాంత పోతారు. కాని అలా జరగాలని రాసిపెట్టి ఉండటంచేతనే అవి జరిగాయి. విధిలిఖితం జరిగే తీరుతుంది."

తరవాత నావికుడు సింద్‌బాద్ బరువులు మోసేవాడికీ తన మిగిలిన అతిథులకూ తన అనుభవాలను ఈ విధంగా చెప్పసాగాడు:






# మీరా బాయి

మార్వారు దేశంలో రత్నసింహుడనే రాజుండేవాడు. ఆయనకు మీరా అని ఒక కుమార్తె కలిగింది. ఆమె అతి సుకుమారి, అత్యంత సౌందర్యవతి. చాలా చిన్నతనం లోనే ఆమెకు, పూర్వపుణ్యసుకృతంచేత, గాఢమైన దైవభక్తి ఏర్పడింది. రంగులు వేసిన మట్టి బొమ్మలతో ఆడుకునేటప్పుడు ఆమెకా బొమ్మలన్నీ కృష్ణుడులాగే కని పించేవి. అప్పుడామెకు అంతులేని ఆనంద పారవశ్యం కలిగేది.

ఆమె పెరిగి పెద్దదవుతున్నకొద్దీ ఆమెలో గల భక్తిభావంకూడా పెరిగి ప్రవహించ సాగింది. ప్రపంచమంతా ఒక ఆనంద సాగరంలాగానూ, కృష్ణప్రేమతో నిండినది గానూ ఆమెకు తోచేది. భక్తిపారవశ్యంలో ఆమె నోటివెంట అద్భుతమైన పాటలు వచ్చేవి. ఈ పాటలలో చక్కని భావాలతో బాటు ముచ్చటైన కవిత్వంకూడా ఉండేది.

మీరాకు పెళ్ళియీడు వచ్చింది. తల్లి దండ్రులు తన పెళ్లికి యత్నాలు చేస్తున్నా రని తెలియగానే ఆమె ఆనందించటానికి బదులుగా విచారసముద్రంలో మునిగి పోయింది. ఆమె తన జీవితం యావత్తూ భగవత్సంకీర్తనకే వినియోగించాలను కున్నదిగాని, సంసార సముద్రంలో మునిగి తేలటం ఆమె కెంతమాత్రమూ ఇష్టంలేదు.

ఆమె తన తల్లిదగ్గిరికి వెళ్ళి, "అమ్మా, నామాట కొంచెం విను. మానవజన్మ చరి తార్థం కావటానికి భగవంతుడి ఆరాధన తప్ప మరొక మార్గం లేదు. దుఃఖమయ మైన సంసారకూపంలో పడిపోయి భగవం తుణ్ణి మరిచిపోవటం తగనిపని. అందు చేత, నామీద దయఉంచి నాకు పెళ్లి చేయవద్దు!" అని బతిమాలింది.

ఈ మాటలు విని మీరా తల్లి నిర్ఘాంత పోయింది. తనకుమార్తె ఎప్పుడూ భగవ

ఆర్. శ్యామలాంబ



అర్థంచేసుకోలేరని ఆమె గ్రహించింది. పెళ్లి అయినా, కాకపోయినా, తన జీవితం భగవచ్చింతనకే అంకితంకావాలని ఆమె తన మనసులో నిశ్చయం చేసుకున్నది. ఆమె అదేవిధంగా భగవంతుడివద్ద ప్రమాణం కూడా తీసుకున్నది.

తరవాత కొద్దికాలానికే ఆమె వివాహం జరిగిపోయింది. మేవారు రాణా అయిన కుమార భోజరాజుకిచ్చి మీరాను వివాహం చేశారు. ఆసమయంలో చిత్తూరు మేవారుకు రాజధాని. మార్వారు, జయపూరు మొదలైన రాజపుత్ర సంస్థానాలన్నిటిలోకీ అప్పట్లో మేవారు ఉత్తమమైనది. అలాటి సంస్థానానికి ఇహసుఖాలమీద ఏమాత్రమూ కోరిక లేని మీరా రాణి అయింది.

ధ్యానంలో మునిగి ఉండటం ఆమెకు తెలుసు. అందులో తప్పేమీ లేదుగదా అని ఆమె ఊరుకున్నదిగాని, తనకూతురి భక్తి ముదిరి పిచ్చిలో పడుతుందని ఆమె కలలో కూడా ఊహించలేదు.

"ఏమిటా మాటలు, మీరా? పెళ్ళి వద్దంటావు! పెళ్ళంటే ఏమిటో నీకు తెలుసా? ఆవిషయాలు పెద్దవాళ్ళం చూస్తాం. మేము చెప్పినట్టు నడుచుకోవటమే నీవంతు!" అని ఆమె మీరాను గట్టిగా మందలించింది.

చేసేదిలేక మీరా పెళ్ళికి తలవంచింది. తన హృదయాన్ని తన తల్లి దండ్రులు

రాణాకూడా కవిత్వంలో ఆసక్తిగలవాడే. అతనుకూడా పాటలు రచించేవాడు. భార్యా భర్తలిద్దరూ కొంత కాలంపాటు కవిత్వానందంలో మునిగిపోయారు. మీరాకు రోజులు చాలా ఆనందంగానే గడిచాయి. కాని రానురాను ఇద్దరి కవిత్వాలలోనూ చాలా తేడా కనిపించసాగింది. భగవంతుణ్ణి కీర్తించటం తప్ప మీరా పాటలలో మరొక విషయం ఉండేదికాదు. కుమారభోజుడు అలాకాక కీర్తినిగురించీ, విజయాలను

గురించీ, ప్రపంచసుఖాలలోగల ఆనందం గురించీ పాటలు రాసేవాడు.

మీరా ప్రవర్తనలో కూడా రాణాకు మార్పు కనిపించింది. ఆమె క్రమంగా రాజ వైభవాలనుంచి తప్పుకోసాగింది. విలువైన ఆభరణాలూ, దుస్తులూ విసర్జించింది. హంసతూలికాతల్పాలు విడనాడింది. నార చీరెలు కట్టి, నేలమీద జింకతోలు పరుచుకుని దానిపై పడుకోసాగింది. తన చెలికత్తెలనూ, దాసీలనూ తనచుట్టూ చేర్చి, వారికి తన పాటలు నేర్పి, తాను పాడుతుంటే వారు తనవెంట పాడేటట్టు చేసింది.

అప్పటికీ ఆమె ఆనందం పూర్తికాలేదు. రాజభవనంకూడా నుయ్యిలాటిదే. ప్రపంచం విశాలమైనది. భగవత్కీర్తనచేసి ఆనందించి తరించదగినవాళ్లు ప్రపంచంలో లక్షోపలక్షలున్నారు. వారందరికీ తన పాటలు వినిపించాలి, వారిచేత వాటిని పాడించాలి.

ఒకరోజు ఆమె కృష్ణాలయానికి వెళ్లింది. అక్కడ శ్రీకృష్ణుడి విగ్రహం ముందు ఎంతోసేపు నృత్యంచేస్తూ తన పాటలు పాడి, భక్తితన్మయత్వంలో స్పృహతప్పి పడిపోయింది. తిరిగి స్పృహ వచ్చాక మీరా పూర్తిగా మారిపోయింది. భగవంతుడి అంశ ఆమెలో ప్రవేశించి నట్టయింది.



అదిమొదలు ఆమె రోజూ ఆ దేవాలయానికి వెళ్ళసాగింది. అక్కడ ఆమె తన కోకిల కంఠంతో పాడే అద్భుతమైన భగవత్కీర్తనలు వినటానికి దేశం నాలుగు మూలలనుంచీ వచ్చి జనం మూగి, తన్మయులు కాసాగారు. వారిలో అనేకులు సమస్తమూ త్యజించి భక్తులై పోయారు.

కాలక్రమాన మీరా కీర్తి ఢిల్లీలో వుండే అక్బరు పాదుషా చెవుల పడింది. ఎవరిలో ఏ గొప్పతనం వున్నా ఆనందించగల వుదారుడు అక్బరు. మేవారు మహారాణీ పాడే అమోఘమయిన గీతాలను గురించి విని ఆయనకు వాటిని స్వయంగా వినాలని తీవ్ర

మైన కోరిక కలిగింది. తనకిలాంటి కోరిక వున్నదని తెలిస్తే రాజపుత్రులు అవమానంగా భావించి కయ్యానికి కాలు దువ్వుతారు. అందుచేత అక్బరుపాదుషా తన ఆస్థాన గాయకుడైన తాన్సేనుతో ఈ విషయం చెప్పి సలహా అడిగాడు.

"తమరు బైరాగిదుస్తులు ధరించారంటే ఒకరి అనుమతి అవసరం లేకుండానే వెళ్లి మీ కోరిక నెరవేర్చుకోవచ్చు," అన్నాడు తాన్సేను. ఇద్దరూ కాషాయవస్త్రాలు ధరించి మేవారుకు వెళ్ళారు. కృష్ణాలయం బయట నిలబడి లోపల పాడుతున్న మీరా పాటలు అలకించారు. మీరా పాటలు వింటుంటే అక్బరుకు మతిపోయినట్టయింది. ఆయన మీరా పాదాలమీద పడి, "తల్లీ నాకు మోక్షమార్గం ఉపదేశించు," అన్నాడు.

"నాయనా, ఎల్లప్పుడూ హరిధ్యానం చేస్తూ నిష్కల్మషమైన జీవితం గడుపు," అని మీరా ఆదేశించింది.

అక్బరు తన మెడనుంచి ఒక రత్నహారం తీసి మీరా పాదాలవద్ద పెట్టి స్వీకరించమని కోరాడు.

బైరాగి వాడివద్ద అంత విలవైన హారం వుండటం చూసి మీరా నిర్ఘాంతపోయి, "నాయనా, నీకిది ఎలా దొరికింది? నువు తాపసిలాగున్నావే?" అని అడిగింది.



"అమ్మా, నేను యమునలో స్నానం చేస్తుంటే ఇది దొరికింది. తాపసిని గనక నాకు దీనితో పనిలేదు. దానిని నీ కృష్ణుడికి సమర్పించుకుంటున్నాను," అన్నా డక్బరు.

మీరా హారం ఎత్తి కృష్ణ విగ్రహం మెడలో అలంకరించింది.

అసలే రాణాకు తన భార్య ధోరణి ఏమంత నచ్చలేదు; ఆమె ప్రవర్తన మేవారు మహారాణీ అయిన మనిషికి ఉచితమైనది కాదని ఆయన అభిప్రాయం. దీనికి తగ్గట్టుగా ఆయనకు రత్నహారం గురించి తెలియవచ్చింది. ఆయన ఆ రత్న హారాన్ని తెప్పించి పరీక్షించాడు. దాని ఖరీదు పది లక్షలకు తక్కువ వుండదు. ఇంత ఖరీదైన కానుక ఎవరివ్వగలరు? రాణా ఆస్థానంలో ఒకడు ఈ హారాన్ని అక్బరుపాదుషా కొనగా తాను స్వయంగా చూసినట్టు సాక్ష్యం చెప్పాడు. రాణా వేగుల వాళ్ళను నియోగించి, తన భార్యకు ఆ రత్నహారం ఇచ్చిపోయినవాడు ఢిల్లీపాదుషా అక్బరేనని తెలుసుకుని అవమానంతో కుంగి పోయాడు. మీరా మేవారు రాజ్యానికే కళంకం తెచ్చింది. ఆమెను చంపమని రాణా ఉత్తరు విచ్చాడు.

కాని ఆమెను చంపేవారెవరు? యెంత డబ్బిస్తా నన్నప్పటికీ ఒక్కడూ ఆ పని





చెయ్యటానికి ముందుకురాలేదు. మీరా పవిత్రత ముందు రాణా అజ్ఞ ఏపాటిది? రాణా అమెను చంపించలేక ఒక చీకటి కొట్టులో నిర్బంధించాడు. ఇందుకు మీరా కొంచెమైనా విచారించలేదు. చీకటికొట్టు అమె ఆనందాన్ని కొంచెమైనా తగ్గించలేకపోయింది.

అయితే రాణాకు మీరా బతికివుండటమే కంటకంగా వున్నది. అమెకు ఒక గిన్నెలో విషం పంపాడు. భగవంతుణ్ణి స్మరిస్తూ మీరా విషాన్ని తాగేసింది. విషం అమెను ఏమీ చెయ్యలేకపోయింది. రెండోసారి రాణా అమెకు ఒక పెట్టెలో విషసర్పాన్ని పెట్టి,



చంద్రహారమనే మిషమీద పంపాడు. పెట్టె తెరవగానే పాము బుసలుకొడుతూ వచ్చి మీరాను కాటువేసింది. మీరా నిశ్చలంగా అ పామును ఎత్తి తన మెడలో వేసుకున్నది.

మీరా చావటానికి తాను చేసిన రెండు యత్నాలూ వృథా అయిపోవటం చూసి రాణా, "నువ్వు అత్మహత్య చేసుకో! ఇది నా అజ్ఞ!!" అని వర్తమానం పంపాడు. మీరా తన భర్తను ఒకసారి చూడాలని కోరింది, కాని రాణా సమ్మతించలేదు. "సరే, అత్మహత్య చేసుకుంటాను," అన్నది మీరా. అమెను విడుదలచేశారు.

అయితే పట్టపగలు అత్మహత్య చేసుకోవటానికి వీలుండదు. అమెను ప్రాణంకన్న ఎక్కువగా చూసుకుంటున్నవాళ్ళు నగరంలో వేనకువేలున్నారు. అందుచేత అమె అర్ధరాత్రి అంధకారంలో పడి ఒంటరిగా వెళ్లిపోయింది. అమెకు దారిలో ఒక నది తగిలింది. అమె అందులోకి దూకేసింది. అక్షణంలో అమె మనస్సు భగవంతుడి మీదనే వున్నది.

నీటిలో మునిగినాక అమె యెదట ఏదో వెలుగున్నట్టు అనిపించింది. అమె చెవిలో ఎవరో ఇలా చెప్పినట్టయింది: "నీ భర్త అజ్ఞానుసారం నువ్వు అత్మహత్య చేసు



కున్నావు. ఇకనుంచి నీకు మరొక జన్మ లభిస్తున్నది. నువు వెళ్లి ప్రజలలో భగవద్భక్తి ప్రచారంచేసి వారిని తరింపజెయ్యి"

కళ్లు తెరిచి చూసేసరికి తాను ఒడ్డుమీద పడుకుని వున్నట్టు స్పష్టమయింది. కాని ఆ ప్రదేశం ఆమె నదిలో దూకిన చోటు కాదు. చీకటికూడా లేదు. సూర్యుడు దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. నదిలో పడినాక తాను చూసిన వెలుగుగాని, విన్న మాటలుగాని ఆమె మరవలేదు. ఆమె అక్కడినుంచి లేచి పాడుకుంటూ పొలాల మధ్యగా బయలు దేరింది.

మీరా కొంతదూరం వెళ్ళేసరికి కొందరు గొల్లకాపరి పిల్లలు కనిపించారు. ఆమె వారిని బృందావనానికి దారి అడిగింది. ఆ కుర్రవాళ్లు ఆమెకు తాగటానికి పాలిచ్చి, బృందావనానికి దారి చెప్పి, కొంతదూరం ఆమెను సాగనంపారు. ఆమె అనేక గ్రామాలమీదుగా తన పాటలు పాడుకుంటూ పోతూంటే, జనం గుంపులు గుంపులుగా ఆమెవద్దకు చేరి తన్మయత్వంలో మునిగి పోయారు. వారిలో కొందరు భక్తిపరవశులై, ఇల్లూ వాకిలీ మరిచి, ఆమెవెంట బయలు దేరారు. ఇలాటి వారందరినీ వెంట బెట్టు కుని మీరా బృందావనం చేరింది.



బృందావనంలో రూపగోసాయి అనే తపస్వి ఉన్నాడు. ఆయనకు ఆడవాళ్లన్నా, బంగారమన్నా అమిత కోపం. ఈ రెంటినీ దగ్గర చేరనిచ్చినవాడు మోక్షం సాధించ లేడని ఆయన అంటూండేవాడు. మీరాకు రూపగోసాయి గురించి తెలిసింది. ఆమె ఆయనకు "బాబూ, బృందావనంలో శ్రీకృష్ణుడు ఒకడే పురుషుడు. మిగిలిన వారందరూ గోపికలు. నువు పురుషుడవై నట్టయితే ఇక్కడ ఉండటం గొప్ప అపచారం. కనక వెంటనే వెళ్ళిపో!" అని సందేశం పంపింది. ఈ బోధన విని రూపగోసాయి చాలా ఆనందించి ఆమెను

తనవద్దకు రమ్మని ఆహ్వానించాడు. అది మొదలు ఆ ఇద్దరూ ఒకరికొకరు గురువుగా ఉంటూ తత్వబోధ చేసుకున్నారు. మీరా పాటలు పాడటం మానలేదు. ఆమె పాటలు దేశమంతా వ్యాపించాయి. చిత్తూరులో ఆబాలగోపాలమూ ఆమె పాటలు పాడటం చూసి మొదట రాణా మండి పడ్డాడు, కాని తరవాత పశ్చాత్తాపపడ్డాడు. తన సామ్రాజ్యం చాలా చిన్నది. ఆమె అంతకన్న పెద్దసామ్రాజ్యానికి రాణి. ఆమె ముందు తానెంతవాడు!

చిత్తూరునుంచి ప్రజలు తండోపతండాలుగా బృందావనానికి వెళ్లి, మీరా దర్శనం చేసుకుని వస్తూండటం చూసి రాణాకూడా బయలుదేరాడు. ఆయన సామాన్య దుస్తులు ధరించి, ఒంటరిగా ప్రయాణంచేసి, బృందావనంచేరి, మీరా నిత్యమూ పాడే గుడివద్దకు వెళ్లి, "భిక్షాం దేహి!" అని కేకపెట్టాడు.

"నేనే భిక్షురాలిని, బాబూ! ఆశీస్సు తప్ప నీకివ్వటానికి నాదగ్గిర ఏమీలేదు," అన్నది మీరా.

"నాకు నీవల్ల ఒక సహాయం కావాలి!" అన్నాడు రాణా.

"ఏమిటా సహాయం?" అన్నది మీరా.

"నన్ను క్షమించటం!" అంటూ రాణా తాను ధరించిన వేషం తీసివేశాడు.

తన భర్తను చూసి మీరా పరమానంద భరితురాలయింది. ఆమె హృదయంలో భర్తమీద లేశమైనా ఆగ్రహంలేదు. ఆమె రాణావెంట చిత్తూరుకు తిరిగి వచ్చింది. అది మొదలు ఆమె జీవితకాలమంతా, ఏడాదికి ఆరుమాసాలు చిత్తూరులోనూ, ఆరుమాసాలు బృందావనంలోనూగడిపింది.

మీరాబాయి నాలుగువందల ఏళ్లక్రితం జీవించింది. కాని ఆమె పాటలు ఇప్పటికీ, ఎప్పటికీ జీవించే ఉంటాయి. వాటిని విని కోట్ల కొద్దీ ప్రజలు తన్మయత్వంపొందారు, ఇంకా ఎన్నో కోట్లమంది పొందుతారు.





# మిత్రభేదం

దమనకుడు :

మడుగు జేరగబోయి - మన రాజు జడిసి
కడ చెట్టుక్రింద చ-క్కగ గూరుచుండె.
తన పరివారమ్ము త-త్తఱ పుట్టి
తన చుట్టు చేరిన-వనికూడ తెలిసె.
అను విది దరి జేరి - ఆ తీరు నెఱిగి
మనవి సేతును రాజ - మంత్రాంగమెల్ల.

కరటకుడు :

భయపడెనో లేదొ ? - పాప మా రాజు
స్వయముగా తెలియునా - సావాసకాడ ?

దమసకుడు :

తెలియకేమున్నది - తెలివి కావలెను
పిలిచి చెప్పిన సరే - తెలియు నందఱకు.
కరులు హయమ్ములు - గద్దించి పలుక
చరచర సాగవా - జంతువులయ్యు.
పలుకక గ్రహియించ-గలరు పండితులు,
తెలివి పరేంగిత-మ్ముల నెఱుంగుటకె.
ఆకార చేష్టల - నాంతర గతుల
వాకుల ముఖ నేత్ర - వైఖరులెల్ల,
కనుగొని మనసులో-గల దాని తెలియు
మనువన్న మాటల - మఱవగా దగునె ?
భయపడి యున్నట్టి - పతి జేరి చీరి
నయమొప్ప ధైర్యమ్ము - నందించి పలికి ;
మును గోలుపోయిన - ముఖ్యప్రధాని
పని నింక సాధింతు - పలు మాటలేల ?

కరటకుడు :

ప్రభుసేవ ఎఱుగవు - ప్రభువుల నెట్లు
సభలోన నీవైపు - సరిజేయగలవు ?

దమసకుడు :

చిన్ననాడే తండ్రి - చెంతను జేరి
విన్నవాడను వచ్చు - విబుధులు సెప్ప.
నీతి శాస్త్రమ్ము నా - నిండు మనమ్ము
లోతుల దాచితి - భీతి చెందకుము.
బంగారు పువ్వుల - బరగు భూదేవి
సింగారములు గోయు - జెట్టిల వినుము—
శూరులు, పండితుల్, - ధారుణీపతులు
చేరి వారల సేవ - జేసెడి వారు—
వీరు నల్వురు తప్ప - పెఱవారి కెట్లు

విద్వాన్ విశ్వం

థారుణీ భాగ్యమ్ము - దక్కంగ గలదు?

కరటకుడు :

అయిన నీ వచ్చటి - కరిగి తొల్దొలుత
ప్రియవాక్కు లేమని - పెద్ద పల్కుదువు?

దమనకుడు :

అపుడేమి యడుగునో - అటు జవాబిత్తు
ఇపుడేమి చెప్పుదు - నేమి పల్కుదునొ?
మాటకు మాటగా - మాటలు నడచు;
సూటి ప్రశ్నకు వచ్చు - సాటి జవాబు.
మాటకారులలోన - మఱి రకాలుండు;
వాటమ్ము చిల్కల-వంటి దొక్కరిది
మాటల నాల్కపై - మాటుకొంటారు;
పోటరుల్ కొందఱు - బుద్ధి దాచుదురు.
మూగవారలవోలె - ముఖ్యవాక్యముల
లోగుండెలను దాచు - లోభులు గలరు.
అందులో గుండెల - నణగిన మాట
ఎందుల నవసర - మందె వెల్వడును.
ముందుగా నేనేమి - ముచ్చటించెదను?
ఇందును గూర్చి ఆ-లించితి మున్నె!
సమయము రానిదే - జారె నామాట,
అమరుల గురువైన - అవమాన పడును.

కరటకుడు :

సరిగాని తమ్ముడా! - మఱి ఒక్క మాట :
నరపతులకు దూర-నతియె సమ్మతము.
దొరలు సర్పమ్ములు - దూరమందుండి
నరులు దండము బెట్ట - సరియైనవారు.
వారి దాపున కెంత-వారైనగాని
చేరరాదెప్పుడు - సెబ్బర యగును.



దమనకుడు :

నీ మాటలో కొంత - నిజమున్నదయిన
నా మాటలోకూడ - నయరీతి కలదు.
ఎవరెట్టి వారలో - ఎఱిగి వారలకు
పువులోని దారమై - పురుషుండు మెలగి
వశులను జేసుకో-వలయు నట్లైన,
వశమౌదురయ్యా రా-వణ వంశ్యులైన.
అనుసరించెడి వారి - నందఱ విడిచి,
జననాథు లటునిటు - చనలేరు సుమ్ము.
చెప్ప నేటికి ప్రభు-చిత్తమ్ము నెఱిగి
మెప్పు బొందుట మన - మేటిధర్మమ్ము.
ప్రభువు కోపించిన - ప్రస్తుతించుటయు,
ప్రభువు మెచ్చిన ఇష్ట-పడుటయు చాలు,
ప్రభు శత్రులను కోప-పడి చూచుచుంట,
ప్రభు దానములజూచి - బ్రహ్మండమనుట,
వరవశీకరణ మం-త్ర రహస్యమిదియె.
పరమంత్ర తంత్రాల - వరుసలే వలదు.

కరటకుడు :

అయిన సరే శుభ-మ్మవుగాత నీకు
ప్రియసోదరా అట్లె - ప్రయతించి చూడు.
నీ యిష్టమైనట్టి - నీతినే నడచి
పాయసాన్నమ్ముల భక్షించిరమ్ము.

దమనకుడు :

సరె పోయివత్తును - కరటకా ఇంక
దొరగారి అడుగుల - దరిసెనమ్మునకు...
అని పల్కి దమనకు - డా మృగరాజు
మును కొల్వు దీరిన - ఘన వటిచ్ఛాయ
కనుగొంచు మెల్లగా - చనినాడు కడకు.



# తొలి మానవ సంఘాలు

పాతరాతియుగంనాటి మానవుడు ప్రధానంగా వేటగాడూ, మాంసాహారీ. వేట అతని ఏకైకజీవనాధారం కావటంచేత దానికోసం ఆతను తన ఆయుధాలను అభివృద్ధి చేసుకుని, ఆ వేటలో చురుకుదనం ప్రదర్శించి, సంఘజీవి అయాడు.

మానవుడు శాకాహారులైన "ప్రైమేట్స్" నుంచి పరిణామం చెందినప్పటికీ హిమయుగంలో ఫలవృక్షజాతులు అంతరించి జంతువులకు పనికివచ్చే గరిక బయళ్లు ఏర్పడటంవల్ల మాంసాహారీ, వేటగాడూ కావలిసివచ్చింది.

రాతిగొడ్డలితో ఒకచివర కోసగా చెక్కి, గోకుడుపెళ్లలతో నునుపుచేసిన కర్రయీటె అనేక సహస్రాబ్దాలపాటు మానవుడి ఉత్తమ ఆయుధంగా పని చేసింది. నియాండర్తాల్ మనుషులు ఈ ఈటెకు ఒక రాతిములుకు తగిలించి, దాని సహాయంతో సాటిలేని వేటగాళ్లుగా జీవించారు. బ్రహ్మాండమైన జడల ఏనుగులనుసయితం వారు వేటాడారు. వారు ఎంతో ఓపికగా దానిని మాటులోకి చేర్చి, దూరంనుంచి తమ ఈటెలతో గాయపరిచి, రక్తం కోల్పోయి అది కదలలేని స్థితికి వచ్చినదాకా వేచిఉండి, తరవాత దానిని చుట్టుముట్టి చంపేసేవారు. ఇంత శ్రమపడినందుకు వారికి బోలెడంత మాంసాహారమూ, విశాలమైన చర్మమూ, ఉపయోగకరమైన దంతాలూ, నిప్పులో మండించటానికి కొవ్వుతో కూడిన ఎముకలూ దొరికేవి. ఇటువంటి జంతువులను వేటాడటానికి అనేక మంది మానవులు సమష్టిగా కలిసి శ్రమపడాలి. ఈ సమష్టిశ్రమే రాతియుగం నాటి కుటుంబాలకు దారితీసింది. అనేక కుటుంబాలు కలిసి వేటలో పాల్గొనేవి.

సుమారు 25 వేల ఏళ్లక్రితం రాతియుగపు మానవులు వేటభూమిగా ఉపయోగించిన ఒక విశాలప్రదేశం ఫ్రాన్స్‌లో కనిపెట్టబడింది. ఈ ప్రదేశంలో లక్ష అడవిగుర్రాలకు సంబంధించిన ఎముకలు కనిపించాయి.

అప్పటికింకా మానవులు జంతువులను మచ్చికచేయటం నేర్చుకోలేదు. కాని విస్తారసంఖ్యలో మానవులు కలిసి పనిచేస్తూ, మందలుగా తిరిగే అడవి గుర్రాలనూ, అడవి బర్రెలనూ, ఇతర జంతువులనూ మూకఉమ్మడిగా వేటాడే పద్ధతులు బాగా నేర్చారు. ఆ జంతువుల మాంసమూ, చర్మాలూ మాత్రమే వారికి ఉపయోగించేవి. ఈవిధంగా పాత రాతియుగంలోనిమానవులు తాము వేటాడిన మృగాల రూపాలను కొయ్యలో మలిచి, రాతిమీద చిత్రించారు.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 సెప్టెంబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒప్పుల కుప్ప

రెండవ ఫోటో : వయ్యారి భామ

పంపినవారు : కొప్పుల హేమాద్రి, S/o కె. అచ్చయ్యగారు, గొల్లప్రోలు, పిఠాపురం తాలూకా, (తూర్పుగోదావరి జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ఇంద్రజాలము

ప్రొఫెసర్ పి. సి. సర్కార్

పేకముక్కను కనుక్కోవడంలో చాలా విధాలున్నాయి. కాని నా ఉద్దేశంలో ఈ కింది పద్ధతి చాలా సులువైనది!

చీట్లపేక ముక్కల వెనకవైపు చూసినట్టయితే అందులో రెండు రకాలు కనిపిస్తాయి (1) తలకిందు చేయటానికి వీలయినవి (2) ఎటు తిప్పినా ఒకటిగానే ఉండేవి. A అనే బొమ్మలో పైవరుసలో నాలుగు రకాల ముక్కలున్నాయి. ఈ వరుసలోవున్న ముక్కలలో (1) గళ్లడిజైనూ, (2) పువ్వుడిజైనూ, (3) మళ్ళీ గళ్లడిజైనూ, (4) ఒక స్త్రీ తలా వున్నాయి. అవే కింది వరుసలో తలకిందు చేసిఉన్నాయి. 1, 3 నంబరుగల ముక్కలు పైవరసలోనూ, కిందివరసలోనూ కూడా ఒకటిగానే ఉన్నాయి. 2, 4 నంబరుగల ముక్కలు కింది వరసలో తలకిందు కావటం తెలుస్తున్నది.

ఈ ట్రిక్కు చెయ్యటానికి గ్రేట్ మొగల్, కారవాన్ మొదలైన పేకలు మంచివే అయినా ఉపకరించవు. తలకిందులు చేస్తే తెలిసేలాటి ముక్కలు గల పేకలే కావాలి. ఇవి సాధారణంగా ఖరీదైనవిగా ఉంటాయి. ఇలాటి పేక ఒకటి తీసుకుని అన్ని ముక్కలూ ఒకే విధంగా ఉండేటట్టు అమర్చి పెట్టుకోవాలి.

ఉదాహరణకు—B లో పువ్వులన్నీ పైకి ఉండేలాగ అమర్చి ఉన్నాయి. ఈ విధంగా అమర్చిన పేక తీసుకుని ఐంద్రజాలికుడు, ప్రేక్షకులలో ఒకరిని ఏదో ఒక ముక్క తీసుకోమంటాడు. ఈ ముక్కను ప్రేక్షకులు చూసుకునే సమయంలో ఐంద్రజాలికుడు తన చేతిలోని పేకను తల్లకిందులు చేసేసి, ముక్కను తిరిగి పేకలో పెట్టెయ్యమని ప్రేక్షకుడితో అంటాడు. ఈ ముక్క తప్ప, పేకలో మిగిలిన ముక్క లన్నీ తలకిందులుగానే ఉంటాయి. అందుచేత ఐంద్రజాలికుడు ఆ ముక్కను సులువుగా గుర్తించ గలుగుతాడు.

తలకిందులు చేస్తే మారని ముక్కలుగల పేకలతో ఈట్రిక్కు చేసేవారు ముక్క లన్నిటిమీదా ఒక చివర సిరాగుర్తులో, పెన్సలు గుర్తులో పెడతారు.







[పాఠకులు, యీగారడీని గురించి సలహాలు పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ, ప్రొఫెసరుగారి పేర ఉత్తరం రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయాలి

వారి అడ్రసు యిది :- ప్రొఫెసర్ : పి. సి సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888 కలకత్తా - 12.]

## అట్టచివరి బొమ్మ

### ఒకరోజు రాజు - 7

ఖలీఫా అబూను చాలా ఆదరంతో చూసేవాడు. అబూ ఖలీఫాను తన చమత్కార సంభాషణలతో రంజింపజేస్తూండేవాడు. అతను ఖలీఫా అభ్యంతర మందిరంలోకీ, రాణీ జుబేదా అభ్యంతర మందిరంలోకీ కూడా యధేచ్ఛగా వెళుతూ పెద్దవజీర్ జాఫర్‌కన్న ఖలీఫాకు ఆప్తుడుగా ఉండేవాడు. ఈ గౌరవమర్యాదలతో అబూ తల తిరిగిపోలేదు, అతిశయం పట్టుకోలేదు.




తన దాసీ అయిన గన్నా అబూకేసీ, అబూ గన్నాకేసీ తరుచు చూసుకుంటూండటం గమనించి, రాణీ జుబేదా వారిద్దరికీ వివాహం చేస్తే బాగుంటుందేమోనని ఖలీఫాతో ఒకనాడు అన్నది. ఖలీఫా ఇద్దరినీ చేర్చి, వారి సమ్మతి తెలుసుకుని, వారికి వైభవంగా పెళ్లి చేసేశాడు.

వారిద్దరూ కొంతకాలం ఉల్లాసంగా గడిపారు. గన్నా రాణివాసంలో పెరిగినది కావటంచేత ఆమెకు రాజభోగాలు అనుభవించటం బాగా తెలుసు. ఈ భోగాలకింద అబూదగ్గిర ఉన్న ధనమంతా కర్పూరంలాగా ఇట్టే హరించిపోయింది.

"ఒళ్ళుపై తెలియకుండా ఉన్నదంతా ఖర్చుపెట్టేశాం. ఖలీఫా నాకు నెలజీతమంటూ ఏర్పాటు చేయలేదు. ఆయనను డబ్బడగటం నాకెంత మాత్రం ఇష్టంలేదు. ఇప్పుడు మనం ఏంచెయ్యాలి?" అన్నాడు అబూ భార్యతో.

"జుబేదా రాణీని అడగటం నాకూ ఇష్టంలేదు. నీకేదైనా ఆలోచన తోస్తే చెప్పు, నేను సహాయం చేస్తాను," అన్నది గన్నా.

"అయితే ఒకటే ఉపాయంఉంది. అదేమిటంటే, మనం చచ్చిపోవటం!" అన్నాడు అబూ.

"అమ్మో, నేను చావను. కావలిస్తే ఈ ఉపాయం నీఒక్కడివీ అమలు చెయ్యి," అన్నది గన్నా.

"ఆడవాళ్లకు శాస్త్రయినా మెదడు లేదు. అందుకే నేనంతకాలం బ్రహ్మచారిగా ఉండిపోయాను. ఏమిచెబుతున్నానో, ఎందుకు చెబుతున్నానో అడిగి తెలుసుకోరాదూ? అంత తొందరేం? మనం చస్తే డబ్బెట్లా వస్తుందే, పిచ్చిదానా? చచ్చినట్టు నటించాలి. అంతే!" అన్నాడు అబూ.

"అదెట్లా?" అన్నది గన్నా.

"విను. నేను మక్కావేపు కాళ్ళు పెట్టి నేలమీద నిగడదన్ని పడుకుంటాను. నువు నామీద దుప్పటి కప్పి, నా ముఖంమీద తలపాగా బోర్లించు. తరవాత కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ జుబేదా రాణీదగ్గిరికి పోయి, నేను చచ్చానని చెప్పి మూర్ఛపో. పన్నీరు కడవలతో కుమ్మరించినదాకా లేవకు. ఆతరవాత ధనం ఎట్లా వచ్చిపడేదీ నువే చూద్దువు గాని!" అన్నాడు అబూ.

"ఇదయితే మన చేతిలో పనే," అంటూ అబూ వంటికి దుప్పటి చుట్టి, ముఖాన తలపాగా కప్పి, గొల్లున ఏడుస్తూ రాణీవద్దకు పోయి తనభర్త చచ్చినట్టు చెప్పి విరుచుకు పడిపోయింది గన్నా.

ఆమెకు కలిగిన ఆపదకు దాసీలేగాక జుబేదారాణీకూడా కళ్ల నీరు పెట్టుకుంటూ, గన్నాను పన్నీటితో సేదదేర్చి, పరామర్శించారు. రాణీ తన స్వంత ఖజానాదారును పిలిచి, "పదివేల బంగారు దీనారాలు వెంటనే తీసుకుని గన్నా ఇంట ఇచ్చిరా. పాపం, అబూ అల్ హసన్ అకస్మికంగా చనిపోయాడు. అబూ ఉత్తరక్రియలకు డబ్బు అవసరమవుతుంది," అన్నది.

గన్నా మెల్లిగా స్పృహ తెచ్చుకుని, రాణీదగ్గిర సెలవు పుచ్చుకుని ఇంటికి వచ్చేసింది. ఆమెవెనకనే పదివేల దీనారాల సంచీకూడా ఇల్లు చేరింది.

—(ఇంకా వుంది)





# వార్తలు-విశేషాలు

వచ్చే అయిదు సంవత్సరాలలోను, నూనెగనుల అన్వేషణకు, ఇండియా ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమానికి **30** కోట్ల రూపాయలు ఖర్చు కాగలవని, ఇండియా ప్రభుత్వ సహజ సంపదల శాఖా మంత్రి శ్రీ మాలవీయ లోక్‌సభలో వెల్లడించారు.

*　　　*　　　*　　　*

విశాఖపట్నంజిల్లాలోని అరకులో డీసెల్ పవర్‌స్టేషన్‌ను నెలకొల్పే స్కీమును, ఆంధ్ర ప్రభుత్వం ఆమోదించింది. ఈ స్కీముకు **97,350** రూపాయలతో ప్రారంభించి, అయిదవ సంవత్సరం ముగిసేనాటికి **30,4180** రూపాయిలదాకా ఖర్చు కాగలదని అంచనా వెయ్యబడింది.

*　　　*　　　*　　　*

వైస్‌ప్రెసిడెంట్ డాక్టర్ రాధాకృష్ణగారు రచించిన, "భారతీయ తత్వశాస్త్రం" అన్న గ్రంథం. రెండు సంపుటాలలోను, మొదటిది రష్యన్ భాషలోకి అనువదించబడింది. ఈ రష్యన్ ప్రచురణకు డాక్టర్ రాధాకృష్ణగారు ప్రత్యేకంగా ఒక పీఠిక రాశారు.

*　　　*　　　*　　　*

బాపట్లలోని వ్యవసాయ కళాశాలలో ప్రస్తుతం **96** మంది విద్యార్థులు మాత్రమే ఏటా చేర్చుకొనబడుతున్నారు. **192** మంది విద్యార్థులు ఏటా చదువుకునేందుకు వీలుగా, యీ కళాశాలకు అర్థికసహాయం చెయ్యవలసిందని ఆంధ్రప్రభుత్వం కేంద్రప్రభుత్వాన్ని కోరింది.



ఏటా 400 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే పథకాన్ని ఆంధ్ర ప్రభుత్వం తయారు చేసింది. రైతులు వ్యవసాయానికి విద్యుచ్ఛక్తిని ఉపయోగించుకుని అధికోత్పత్తి సాధించాలని ప్రభుత్వంయొక్క వుద్దేశం.

* * * *

మే 22-వ తేదీన ప్రారంభమైన గోదావరి పుష్కరాలు జూను 2-వ తేదీతో సమాప్తమైనవి. పుష్కరానికి వచ్చిన యాత్రికులు 16½ లక్షలు అని అంచనా వేయబడింది.

* * * *

భారత ప్రభుత్వం వచ్చే ఏప్రిల్‌నుంచి దశాంశపద్ధతిని 'నయా పైసా' మొదలు రూపాయి వరకు కొత్త నాణాలను చెలామణి చేయబోతున్నది.

* * * *

**1956** మార్చి వరకు నిర్వాసితులకు ఋణాలరూపంగా ఆర్థిక పునరుద్ధరణ శాఖవారు 1,256.96 లక్షల రూపాయలు మంజూరు చేశారు. ఇందులో పశ్చిమ పాకిస్తాన్‌నుండి వచ్చిన శరణార్థులకు 822.46 లక్షలు, తూర్పు పాకిస్తాన్‌నుండి వచ్చిన శరణార్థులకు 434.50 లక్షలు మంజూరు చేయబడింది.

* * * *

గ్రామప్రాంతాలలో రోడ్డు అభివృద్ధి సహకారపథకం కింద ఇండియాప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు 60–69 లక్షలు మంజూరు చేసింది. ఇందులో 46–53 లక్షలు ఇదివరకే పంపకం చేయబడ్డాయి.

* * * *

ఇండియానుండి కిందటి సంవత్సరంలో బర్మా, సిలన్, ఇరాన్, మలయా, నైగీరియా, నేపాలు, సౌదీఅరేబియా, థాయ్‌లండ్, అమెరికాలకు 60,650 రూ. ఖరీదుచేసే పాముకాటు మందు ఎగుమతి చేయబడింది.



# చిత్రకథ




ఒక రోజున వాసూ, దాసూలు బడికి వెళ్లేసరికి, పంతులు, బండ బాలయ్యా కోసం కేకలు పెడుతున్నాడు. బాలయ్యా పలకా, పుస్తకాలు మాత్రం ఒక మూల వున్నాయి; అతడు మాయమైయ్యాడు. దాసూ, వాసూలు బాలయ్యాను వెతికి పడతామన్నారు. 'టైగర్'ను తీసుకు వచ్చి, బాలయ్యా పుస్తకాలను వాసన చూపించారు. 'టైగర్' అక్కడి నుంచి సరాసరి పరిగెత్తి, మామిడి తోటలో ఒక చెట్టు కిందకుపోయి, పైకి చూస్తూ అరవసాగింది. కొమ్మల్లో దాక్కుని బాలయ్యా కనిపించాడు. పంతులు, బండబాలయ్యాను బడికి లాక్కుపోయాడు.





**Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'**


నిర్మలకు పాఠము...


మాలతియొక్క చిన్ని కుమారుడు మోహన్ ఎల్లప్పుడూ తన ఆటవస్తువులనుక్రిం- దిఅంతస్తులోని ఇంట్లో కిపడవేస్తుంటాడు- నిర్మల ఇంట్లోకి.
పెంకి మోహన్! నీవుమరొక ఆటవస్తువును పడవేశావు!


నిర్మల ఇంట్లో
మోహన్‌యొక్క ఆటవస్తువుల- ను మాలతికి ఇచ్చివే యగూడదూ?
అప్పుడే కాదు- అతనికి బుద్ధి చెప్పాలి...


తరువాత
చూడు! ఇప్పుడు మరొక తువ్వాలను పడవేశారు!
(ఆలోచిస్తున్నది) ఇదిఎంతో శుభ్రంగా వున్నదే! నాకు ఆశ్చర్యంగా వుంది...


మాలతి ఇంట్లో
నిర్మలా! మోహన్‌యొక్క ఆటవస్తువులను నీవు తిరిగితెచ్చావా
అవును.. మరి మీతువ్వా లును, కూడా, ఎందుకనగా నిన్నొకటి అడుగ- దలంచాను-


దానిని ఎంతో శుభ్రముగానీవెట్లు ఉతికితివి, నాకు- చెప్పు? నీవుఉతుకు- నప్పుడు బాదుట నేనెప్పుడూవిను- టలేదు.
అయితే, నేనుబాదను. ఎందుకనగానేను సన్‌లైట్ సబ్బును ఉపయోగించు చున్నాను


బాదుట బట్టల- ను త్వరగా చిరిగి పోవునట్లు చేయును ఎందుకనగా అది- బట్టలపోగులను తెంచును.


బాదబడిన బట్ట పెద్దదిగా చూపబడినది.


సన్‌లైట్ సబ్బుయొక్క సమృద్ధ యినసురగ బట్టను- బాదకుండానే శుభ్రముగా ఉతుకును, ఆవిధంగా మీ బట్టలు చాలకాలము మన్ను- నట్లు చేయును.


అదినిజం! సన్‌లైట బట్టలను బాదకుండానే తెల్లగాను కాంతివంత- ముగాను ఉతుకును ఆవిధంగా బట్టలు చాలకాలముమన్ను- ను మరియు నాకు డబ్బుకూడామిగు- లును!
SUNLIGHT SOAP
SUNLIGHT SOAP


సన్‌లైట్ సబ్బు
భారతదేశంలో తయారుచేయబడినది
బట్టలు చాలకాలము
మన్నునట్లు చేయును
S. 238-50 TL

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

వయ్యారి భామ

పంపినవారు:
కె. హేమాద్రి - గొల్లప్రోలు

